# వాసిరెడ్డీయము





ప్రకాశకుడు:
బాలేమర్తి లక్ష్మీనరసింహం,
బాలేమర్రు అగ్రహారం.

# వాసిరెడ్డీయము

ఇది

గుంటూరుజిల్లా - సత్తెనపల్లితాలూకా

బాలేమర్రి అగ్రహారవాస్తవ్యులగు

కీర్తిశేషులయిన

## అమరవాది రామకవిగారిచే

ప్రణీతము

రాజా శ్రీ వాసిరెడ్డి వేంకటాద్రి నాయుడు బహద్దరు

మన్నె సుల్తాన్ గారి వంశీకులగు

శ్రీ

వేంకట లక్ష్మీనృసింహ నాయుడుగారి పేర

అంకితము

బాలేమర్తి లక్ష్మీనృసింహం గారిచే

ప్రకటితము.

1936.

 [వెల రు 0-8-0

# వాసిరెడ్డీయము

ఇది

గుంటూరుజిల్లా - సత్తెనపల్లితాలూకా

బాలేమర్రి అగ్రహారవాస్తవ్యులగు

కీర్తిశేషులయిన

## అమరవాది రామకవిగారిచే

ప్రణీతము

రాజా శ్రీ వాసిరెడ్డి వేంకటాద్రి నాయుడు బహద్దరు

మన్నె సుల్తాన్‌గారి వంశీకులగు

లేటు

వేంకట లక్ష్మీనృసింహ నాయుడుగారి పేర

అంకితము

బాలేమర్తి లక్ష్మీనృసింహం గారిచే

ప్రకటితము.

1936.

 [వెల రు 0-8-0

# విషయసూచిక

## ప్రథమాశ్వాసము.



## ద్వితీయాశ్వాసము.



శ్రీ ఉమామహేశ్వరాభ్యాం నమః

# వాసిరెడ్డీయము

## ప్రథమాశ్వాసము

— ఇష్టదేవతాప్రార్థనాదికము —

ఉ. శ్రీపరమాదరద్గళులు • శేఖరితాబ్జులు నభ్రకుంతలుల్
ప్రాపితకుండలుల్ కమల•పాణులు నాగ్నిశిఖాళికుల్ తనూ
క్షేపితనారదాంశు లయి • స్నేహమెసంగ పరస్పరాపృథ
గ్రూపమహోన్నతింబొలుచు•కుధ్రసుతేశ్వరులన్ స్మరించెదన్.

క. అని యిష్టదేవతావం
దనముం గావించి బుధజ•నంబులు మెచ్చం
గ నొకానొక నూతన కృతి
నొనరింప మదిందలంచి • యున్నట్టి తఱిన్. 2

సీ. ఆగతాభోగ భో•గానుభవంబున
నేరాజు స్వారాజు • నే పడంచు
నశ్రాంత విశ్రాణ•నశ్రీధురీణత
నే ఘనుం డాఘను • నెగ్గులాడు

దృఢభుజోత్తేజిత ♦ తేజఃపరంపర
నేయినుం డాయిను♦నేవగించు
సంధానుసంధాన ♦ బంధూభవచ్ఛక్తి
నేనరుం డానరు ♦ నీసడించు
గీ. సతడు బంధురోన్మ♦దాత్యంధపరిపంథి
గంధసింధురౌఘు♦సింధురారి
వెలయు వాసిరెడ్డి ♦ వేంకట లక్ష్మి నృ
సింహనాయ డధిప♦ శేఖరుండు. 3

సీ. మహితశీలుడు చిరు♦మామిళ్ళ భాను ప్రి
సాదనాయడు నిజ ♦ స్యాలకాద్య
డార్యవర్యుడు నిజ ♦ వ్యవహార కారికో
ద్యమి చతుర్వేదు లా ♦ ద్వైతశాస్త్రి
చిరుమామిళాన్వయ ♦ వరు డాత్మ సాచివ్య
కరుడగు బుచ్చిరా♦ఘువయ విభుడు
రాజసనాన్మన గా ♦ రవవర్ధిత యశో వి
హారి మల్లాది కా♦మయ్యసూరి
గీ. మఱియు గవిబుధ గురుహితా♦మాత్యభృత్య
బాంధవభటాది నా నాత్మ ♦ పరిజనంబు
గదిసి కొలువంగ బేరోల ♦ గంబుదీరి
యిష్టగోష్ఠీవినోద సం ♦ తుష్టు డగుచు. 4

క. వ్యవహారికు లాత్మీయ
వ్యవహారము లెచ్చరింప ♦ నచ్చో సుకవుల్

కవితామధురిమ దెలుపం
గ విని తదీయాభినూత్న • కౌతూహలినై. 5

మ. నను మత్పూర్వబుధార్జితాగణితమా•న్యక్షేత్రభవ్యాగ్రహా
రనిరాయాసనమగ్రజీవను సుధీం•ద్రశ్లాఘ్యమాన ప్రవ
ర్తనునచ్ఛామరవాదిరామయను మే•ధాదక్షిణామూర్తిసాం
ద్రసవానుగ్రహభాక్కవిత్వమహిమన్•రప్పించితానిట్లనున్.

మ. కృత వేదాధ్యయనుండు సూనృతవచః•కీర్ణుండు నన్నప్రదా
త తమోహారు డయాచకుండు గిరిశ•ధ్యానావధానుండు వి
శ్రుతశిష్టాగ్రణియా భవద్గురుడహో • సోమేశ్వరాభిఖ్యదీ
క్షితవర్యుండు తదాత్మజుండవగునీ•శీలంబుసామాన్యమే.

సీ. అమిత హూణప్రభు • త్వాభిమగ్నాత్మరా
జ్య మెవండు పునరుపా • ర్జనమొనర్చె
చతురభాషామణీ • పాదూర దర్శిత్వ
నీతివిద్యామహా • నిపుణు డెవ్వ
డెత్తుకు మిగిలిన • యీవిపో యిదియన
భూరిమాన్యంబు లే•పుణ్యుడొసగె
విపుల సాహిత్యక•విత్వపురాణగా
థావేత్తృతాదక్షు• డేవిభువరు
గీ. డట్టి మా వాసిరెడ్డివెం • కాద్రిచంద్రు
డైన ముక్త్యశ్వర ప్రసా • దావనీంద్రు
ద్రౌపదీపరిణయమహా • గ్రంథరచన
గరము మెప్పించి బహుమతుల్ • గంటివౌర! 8

మ. ఘనవాక్ప్రౌఢిమ ద్రౌపదీపరిణయ ◆ గ్రంథాదిమావంశ వ
ర్ణనముం జేసితివంచు వింటిమటఁజేయుర్ ◆ మా ప్రాజ్యరాజ్యంబు హూ
ణనకేంద్రుల్ గయిఁకొంటదానికగునా ◆ నాకారణంబుల్ రయం
బున నీవొక్కప్రబంధమార్యవరులా ◆ మోదింపగావింపుమా.

క. అని కప్పురపువిడియంబిడ
ననువొంద మహాప్రసాద ◆ మని కొని హర్షం
బున దత్కులానతారా
ద్యనుపమకథ తేటపఱుప ◆ నభిరతమతినై. 10

గీ. వాసిరెడ్డిచరిత్రమై ◆ వరలుకతన
వాసిరెడ్డీయ మనగ నా ◆ హ్వాయమొనర్చి
యలనృసింహాధిపాజ్ఞ సీ ◆ శార్ష్ణముగ
గృతియొనర్చెద దత్క్రమం ◆ బెట్టిదనిన. 11

—◆ కృతిపతివంశవర్ణనము ◆—

సీ. సంతతధ్యాత మ◆స్కరిలోకమానస
మానస స్వర్ణతా◆మరసమెద్ది
నమ్రసర్వసుపర్వ ◆ నవరత్న కోటీర
కోటీ రమాంచిత ◆ వాటమెద్ది
హాలకులిశాదిరే ◆ ఖాంచద్వసు కలాప
సుకలాపమునకు మం◆జూషమెద్ది
సకల జగద్భాగ్య ◆ సంపదాకరపద్మ
కరపద్మ సంసేవ ◆ బరగునెద్ది

గీ. యట్టి శ్రీవిష్ణుదేవు భ॰వ్యాంఘ్రియుగళి
భువనపావని గంగతో॰బుట్టువగుచు
గంటక గళాంత రోత్తంభి ॰ కంటకంబు
శూద్రజాతి జనించె న ॰ స్తోకరీతి. 12

ఉ. ఆయసురారిపాదభవ॰మై తగు నాలవజాతిలో సుశీ...
లాయనచారియై కలిశ ॰ యపజ్ఞ వర్తిల జూచి హృద్యవి
ద్యాయతనుల్ బుధేందుల మ॰హాశుభవై భవశాలి క
మ్మాయన కమ్మజాతియయి॰త్మాతలివర్ధిలెనట్టి జాతిలోన్.

సీ. తన శరవ్యప్రభా॰వనిరూఢి శరజన్మ
జామదగ్న్యుల కుపా॰స్యంబుగాగ
తనగదాదండభం॰డన పాండితియు భీమ
కార్తవీర్యుల కళ॰క్యంబుగాగ
తన మహావ్యూహ యో॰ జనభేదనపౌఢి
ఘటజ భీష్ములకు దు॰ర్ఘటముగాగ
తన ఖేటఖడ్గ సా ॰ ధన కౌశలము కృత
వర్మసాత్యకుల కా ॰ వశ్యకముగ

గీ. సర్వమస్త్రైవైరి సైనికా ॰ ఖర్వగర్వ
సాగరౌర్వభవద్భుజా॰శౌర్యమాని
కాయుడగుచు సదాశివ॰నాయడనగ
గాలె ననిగెల్పుకా డొక్క॰కమ్మటీడు. 14

ఉ. అత్తఱి సార్వభౌముడగు ॰ నయ్యనవేమయరెడ్డి భూమిభృ
త్సత్తము డాసదాశివ ప్ర॰థన్ విని కానొసరించి శౌర్యసం

పత్తు పరీక్షచేసి బహు ♦ మానముతో సల కమ్మమన్నె రా
హుత్తునకిచ్చె స ర్వముగు ♦ నొక్క మహాపృతనాధిపత్యముః.

వ. అంత.

చ. ఘన నిజరాజరాజత ప్రి ♦ కాశిలగా నరిగాపులొచు స
ర్వనృపులుగొల్వ వేమనధ ♦ రాపతి రాజ్యము సేయుచుండగ గ్రి
చ్చున బ్రతివత్సరంబొసగు ♦ సుంక మొసంగక మీఱిపశ్చిమా
వనిపులు మల్ల బాటిడగ ♦ వారల గెల్వ జమూసమేతుడై. 16

మ. అనవేమప్రిభు డేగ వేగని యసం ♦ ఖ్యంబైన మీ మీబలం
బును బోకార్పగనేటికే మొకచమూ ♦ పుంబుత్తమదోర్యధునా
జిని మీ బంటొకరుండు గెల్చిన నరిం ♦ జెల్లింతు మారీతి గె
ల్వనిచో బన్నిడకుందుమంచుశపథ ♦ వ్యాపారులై శాత్రవుల్.

చ. తమ మొనలోన నొక్కరు ను ♦ దగ్రిబలాన్వితు నేర్చి పంప వా
డమితరణోత్సవుండయి య ♦ మాకృతినిల్వగ జూచి వీని క
య్యమున జయించువాడెవడ ♦ టం చెద జింతిలు రెడ్డి జూచి తీ
వ్రిమున జయింతు నేనితని ♦ వందుర నేల యహో మహాప్రిభో.

మ. అని వేవేగ సదాశివప్రిభుడు దృ ♦ ప్యద్యుద్ధసన్నద్ధుడై
తనతో మార్కొనబూనియున్న రిపుయో ♦ ధ శ్రేష్ఠుతో మోహరిం
చిని తాంతాహవమాచరించియతనిన్ ♦ సింహంబుమత్తద్విపం
బును బోలెం దునిమెః హితాహితులకున్ ♦ మోదంబు
ఖేదంబుగాః. 19

మ. తమజోదుం బొరిగొన్నచో నలిగి పా ♦ థస్స్వామిదిగ్నాథు ల
క్రిములై క్రిమ్మరనా సదాశివుని బో ♦ రః భూరిబాహా పరా

క్రముల౯ వేయెనమంద్రబంచి రెనమం ♦ ద్రందానొకండయ్యున
శ్రమలీలన్ ద్విరదం బరట్లనువలెం ♦ జక్కాడెనాహాయనన్.

ఉ. తొమ్మిదిమందిసైనికుల ♦ మ్రించుటనారసి పశ్చిమాధ్యులా
లమ్మున కింకబూనిన బ♦ళా మన సేనలనెల్ల వీడె నా
శమ్మొనరించునంచు భయ ♦ సంభ్రమమానసులౌచుభక్తిగ
ప్పమ్మిడగా నోడంబడిరి ♦ ప్రాగ్విధి వేమనరెడ్డిగారికిన్. 21

చ. పెనకువ నోర్చి శాత్రవుల ♦ బిట్టరిగాపుల జేసి రాజరా
జనియెడి వాసిరెడ్డి కల♦రార్చుట దా, నలవాసిరెడ్డి నా
దనరె సదాశివప్రభుడు ♦ ధాత్రిక్రమంబున వాశిరెడ్డివా
రనగ దదీయవంశభవు ♦ లందఱువిశ్రుతికెక్కి రున్నతిన్. 22

మ. అనవేమాధిపుడాసదాశివునిశౌ♦ర్యస్ఫూర్తికిఁ మెచ్చి పె
ల్పన నవ్వైక్రమశాలికిం దవిడదే ♦ శంబందునంగొంతసీ
మ నవీనంబుగ గప్పమేర్పఱచి సా♦మ్రాజ్యంబు గావించుకొ
మ్మనుచుఁ సమ్మతిబారితోషికముగా♦నర్పించెనేర్పాటుగన్.

చ. అతులితరాజరాజ బిరు♦దాంకితవేమన రెడ్డ్యధీశ్వరా
ర్పిత ధరణీధురీణుడయి ♦ బ్రీతిసదాశివనాయడుండ నా
క్షితిపతిచేత నాజి మృతి ♦ నొందినవారలవారసుల్ మదిఁ
వితతవిరోధమూని తరి ♦ వేచి వెసం దమరంద ఱేకమై. 24

ఉ. యామినిగాఢసుప్తులయి ♦ నట్టిసదాశివునిఁ దదీయ నృ
స్తోమమునెల్ల శౌర్యమున ♦ ద్రుంచిరి శ్రీగిరిమల్లికార్జునుం

డామహీపాత్మజాతశిశు ◆ వంతకుముందఱ దల్లితో స్వమా
తామహునింటికింజనుట ◆ దైవకృపందొలగెన్విపత్తికిన్. 25

చ. పరిహితసదాశివేభ్యసతి ◆ భర్తృవియోగపు జింత నీసుతో
సహగమనంబుసేయగ వె◆సఁ సమకట్టిసుతుఁ స్తనంధయుఁ
విహితకు విప్రకాంత కతి ◆ విశ్వసనీయకు బ్రోవ నప్పగిం
చిహరసుహృద్ధరిద్విషయ◆సీమకుబంచె నుదంచితత్వరన్. 26

మ. పనుపఁ మాతృవిసర్జితుఁ మృతపితృ ◆ భ్రాత్రాదినీరేండ్లకూ
న నిలాదేవపురంధ్రికై కొని రయా◆నన్వచ్చి నూతక్కినా
జను గ్రామంబున డించె నందుగల శ్రీ◆శక్తీశ్వరస్వామిభూ
ర్యనుకంపాతిశయాప్తి నాతడు జనం◆ బౌరాయన న్వర్ధిలెన్.

ఉ. శ్రీగిరి మల్లికార్జున నృ◆శేఖరసంతతి, బిట్టనేక శా
ఖాగణమై క్రమంబున జ◆గంబున వర్ధిలె దత్సమస్తమా
ద్యాగత వాశిరెడ్డి భవ ◆ నాఖ్య ప్రకాశిలె వాసిరెడ్డిలో
బాగుగ నొక్కకోవ పరి ◆ భాసిలె రాజ్యరమాభిరాముడై.

ఉ. నాటిసమస్తదేశ భర ◆ ణ క్రమదక్షులు రెడ్లు నోఘ్రి క
ర్ణాటులు పారశీకులు ఘృ◆ణామతులై నెసనొప్పి కప్పమే
ర్పాటిడియాత్మసీమలు మి◆రాశిదఖల్పరుపంబ్రభుత్వమున్
బాటిగ వాసిరెడ్డి నర◆పాలు రొనర్చుచుగాంచిరున్నతిన్.

క. ఆ వాసిరెడ్డి నృపతుల
లో వీరపనేడు నాగ ◆ లోకోత్తరుడెం
తే విభ్రాజిల్లె న్నా
నావిమతచమూసమూహ◆నగనగరిపుడై. 30

సీ. తన భక్తితాత్పర్య ♦ దంభమిళిందంబు
నకు సుబాకృప మరం ♦ దంబు గాగ
దన మిత్రితావసం♦తమునకు సామంత
విభులోక ముద్యాన ♦ వితతిగాగ
దన బ్రతాపవ్యాజ ♦ తరణిఘృష్టికి దుర్గ
వర్గంబు కౌశిక ♦ వ్రజముగాగ
దన పరిపాలనో ♦ దగ్రివృష్టికి ధరా
జనసమూహంబు స ♦ స్యంబుగాగ
గీ. లే రితనితుల్యులగు జమిాం ♦ దారు లనుచు
తగవరులు మెచ్చ ముస్తుభాం♦న్నగరుపేరి
వివిధరాష్ట్రింబు మన్నె హం♦వీరు డగుచు
నీతి పాలించె వీరప ♦ నేడు నాడు. 31

ఉ. దారుణ విద్విషద్విజయ ♦ ధారికి వీరపనేడుభూమిభృ
చ్చారికి రాఘవయ్యయును♦జౌదరిరామనచంద్రమౌళియుఁ
భూరమణుల్ తనూభవులు ♦ ముివ్వురుపుట్టిరి వైరివీరదు
ర్వారులు కారణత్రియవి♦రాట్టునకున్ బ్రిభవించుకై వడిన్.

క. ఆ రాజసుతులు ముివ్వురు
తారు సుబావలన శాశ్వం♦తంబైన జమిా
న్దారీ నార్జింపగ నా
ప్పార్కె ఢిల్లీకినరిగి ♦ యవనాధిపతిన్. 33

మ. కనియప్పాడుషహాకువిభ్రమచయ♦త్కారంబులఁ హర్షప్రా
ప్తిని గావించి తదీశువల్ల నలనం♦దిగ్రామసీమోపవ

ర్తన సర్వంబునకున్ స్థిరంబగు జమీ♦న్దారీ మిరాశీ దఖల్
ఘనసమ్రాడ్బిరుదాంకముల్ వడసివే♦డ్కన్వాచ్ఛిత త్తత్ప్రభుల్.

గీ. తమ సమష్ట్యుపార్జి♦తంబు నందిగ్రామ
సీమము తిగవంట్లు ♦ చేసి రందు
మలయురాఘవపురి ♦ మాగల్లు చింతల
పాల్లు మూడువంట్ల ♦ యూళ్లొనర్చి. 35

క. శ్లాఘగ వంట్ల ప్లేర్పడ
గా ఘనుడగు చంద్రమౌళి♦గా రన్నలలో
రాఘవయకు మాగల్లున్
రాఘవపురి రామమన్నె♦రాయనికిన్ రాన్. 36

ఉ. చింతలపాటివంటు వెస ♦ జేకొని దానికి రాజధానిగా
వంతయు నట్టిముక్తిపుర♦వర్యమున న్నివసించి సర్వసా
మంత ధరాధురంధరులు ♦ మన్నెనజీరులు తన్ను నెన్న దు
ర్దాంతనయప్రభావమున♦దానొనరించె మహాప్రభుత్వమున్. 37

క. అల చంద్రమౌళిగారికి
బలవత్పరిపంథి కంధి ♦ బంధుర మంథా
చలుడు గురువాగనగ కే
వల రాఘవు డగుచు రాఘ♦వయ్య జనించెన్. 38

చ. అతడు వసుంధరాబ్జవద♦నాళికకుంకుమ చిత్రకాయితా
యత భుజవిక్రమాతిశయు♦డౌచు బ్రభుత్వము నాచరింప త
ద్గతభయకంపి తాత్ములయి ♦ కంటకవర్గము కాననాంతర
స్థితిభజియింపగా ధరణి♦సెందె నిజావనినామకార్థమున్. 39

క. ఆరాఘువయ్య కనఘు వి
హారపరుల్ రాజమౌళి◆యచ్చన నాత్మో
దారులు జనించి రిరువు రు
దారులు విజితాఖిలోగ్రే◆తర సమదారుల్. 40

వ. అం దగ్రజుండు.

సీ. కలిగించినాడు మా ◆ ద్గల్యకు సారణుల్
ముక్కాలు రాజసం◆బులు ఫలింప
దలగించినా డాత్మ ◆ దాతృతామహిమచే
వివిధార్థిలోకంబు◆ పేదటికము
మలగించినాడు దు ◆ ర్మదవద్విరోధి మం
దిరమధ్య కలిత ప్ర ◆ దీపకళిక
నలిగించినాడు మా ◆ నాథ పాదార్చనా
కలనచే దుర్దమ◆కల్మషంబు
గీ. హద్దులేకుండ భూదాన ◆ మనవరతము
సలుప నిస్సీమ భూదాన ◆ చక్రవర్తి
యనుచు నతనికి బేరిడి ◆ రార్యు లతడు
రాజమాత్రుడె రుచిహేళి ◆ రాజమౌళి. 41

క. ఆ రాజమౌళినాయుడు
గారికి శ్రీ చంద్రమౌళి ◆ గా రవిరత వం
దారుసకలార్యజన బృం
దారక మందారు డతడు ◆ నందనుడయ్యెన్. 42

గీ. చంద్రమౌళి నాయ ◆ డింద్రోపమానుడై
సలిపె బ్రాభవంబు ◆ సర్వలోక
మభినుతింప నిజ భు ◆ జార్గళ కౌక్షేయ
కులిశదళితవృత్ర ◆ గోత్రుడగుచు. 43

చ. ఘనుడగు చంద్రమౌళికి జ◆గన్నుతచర్యుడు రామలింగనా
వనిపతియున్ భుజాశితకృ◆పాణమృషాహతిమథ్యమానభీ
షణబహుళానివార్యరణ ◆ సాగరలబ్ధజయేందిరుండు వీ
రన ధరణీధురంధర కు◆లాగ్రణియున్ జనియించిరిర్వురున్.

చ. నిరతము రామలింగధర ◆ ణీపతి సంతత యౌవరాజ్య ధూ
ర్ధరుడయి వీరనప్రభువ ◆ తంసక మాత్మసహోదరుండు ము
ష్కరపరవీరులం గెలిచి ◆ కప్పములంగొని తెచ్చియిచ్చి సా
దరతను పేంద్రుడింద్రువలె◆దన్ను భజింపన్నొనర్చె రాజ్యమున్

ఉ. ప్రాపిత రాజ్యభోగ ◆ పరిభావితవజ్రికి రామలింగన
క్ష్మాపతిమౌళి కైదుగురు◆కల్గిరి పుత్రులు రాజమౌళి ల
క్ష్మీపతి రాఘవయ్యనయ ◆ శీలపరుండగు చంద్రమౌళి గో
త్రాపతి వెంకయాఖ్యు◆డమరద్రుమ పంచక మబ్ధికింబలెన్.

క. అందగ్రజుండు నృప సం
క్రందనుడన రాజమౌళి ◆ గా రొప్పెను ని
ర్మంద నిజోదారగుణా
నందీభూత గురుముఖ్య ◆ నానాబుధుడై. 47

క. ఆ నరవరు పిదప జ్యే
ష్ఠానుక్రమ లభ్యమాన ◆ మగు వాల్లభ్యం

బూనుకొనె జంద్రిమౌళి
క్ష్మానాయకు డవనిజనము ♦ జయవెట్టంగన్. 48

చ. అతని ప్రభుత్వవేళకు స♦మస్త విదర్భమహోపవర్తనం
బతులితసార్వభౌమ బిరు ♦ దాంకిత హూణనృపాధికారసం
గతమగుకారిలగా దదధి♦కారవశుండయి యాతడుర్విన
ద్భుతగతినేలె దా దనకు ♦ మాక్తిపురంబది రాజధానిగాన్.

క. అల చంద్రమౌళినాయడు
నలువుగ జినవేంకటాద్రి ♦ నాయండను రా
ట్తిలకంబుం గనిమె గులా
చలరిపుడు జయంతుగన్న ♦ చందముదోపన్. 50

క. చిన వేంకటాద్రినాయం
డనిశము సర్వాధికారు♦ లగు హూణమహా
వనిపులచే బాలితుడై
దనరాష్ట్రం బాక్రమించి ♦ ధారుణినేలెన్. 51

సీ. స్థాపించినాడు కృ ♦ ష్ణాపగాతీరమునకు
సోపానతతి జన ♦ సుఖమెసంగ
రోపించినాడు పా♦రూఢిమున్ క్తీశ్వర
స్వామికి బాషాణ ♦ వరణభిత్తి
బాగించినాడు స♦ర్వస్కాంద సంశ్రవ
ణంబు కృష్ణా మహా ♦ త్త్వంబుగృతిని
రూపించినాడు ♦ విద్యాపరిక్షుణ్ణాస్య
మహీదేవుల కనేక ♦ మాన్యములను

గీ. దినదినాంచ త్త్రికాల పా • ర్థివ మహేశ్వ
రపరిజా శరన్నవ • రాత్రిదేవ్య
ర్చన పూజాది నిష్ఠాగ • రిష్ఠు డాత
డధిపమాత్రుడై చినవేంక • టాద్రివిభుడు. 52

క. అతనికి సుతు లుదయించిరి
చతురుడు ముక్తీశ్వర ప్ర • సాదక్షోణీ
పతి చంద్రమౌళి ధరణీ
శతమఖుడు సదాశివ ప్ర • సాదప్రభుడున్. 53

క. ఆ మువ్వురం దగ్రజు డు
ద్దామ యశోవాసనా ని • దానగుణలతా
స్తోమావాలుడయి భవా
నీ ముక్తీశప్రసాద • నృపు డిలనేలెన్. 54

సీ. జ్ఞాతి సామంత రా • జ్యములతో గోరున
జేరు రాజ్యం బుపా • ర్జించినాడు
నరసింహదేవున • కురుభక్తి వేదాద్రి
పురి నైన జోసగ నే • ర్పఱచినాడు
శంకరాచార్యాఖ్య • జగదేకగురునకు
బెద్దకండ్రిక సమ • ర్పించినాడు
బుధ కవి గుర్వాది • భూరివిప్రుల కనే
కోర్వులు మాన్యంబు • లొసగినాడు

గీ. ప్రత్యహాచరితాఖండ • పార్థివార్చ
నా పురాణ కథాశ్రవ • ణ ప్రతిశర

దంబికానవరాత్రి ముఖ్యవ్రతుం డ
తండు ముక్తీశ్వరప్రసాదనృపు డనదె. 55

క. అలద్రౌపదీపరిణయము
వెలయ మదుక్తకృతినొంది స్వీయంబగు చిం
తలపాటి గ్రామమున గు
చ్చల మాన్యము నా కతండొసగె బహుమతిగాన్.

చ. ఏనర ననేక కాలము ప్రభుత్వము నాతడు చేసిచేసి పెం
దనిసి జరాభరార్తి వసుధాభరధుర్యత రోసి స్వాగ్రనం
దనున కుమామహేశునకు దా ధరణీభరణం బొసంగి నె
మ్మనముమహేశ్వరాంఘ్రులసమర్చిసుఖింపుచునుండె వెండియున్.

ఉ. ఆదృతి దాదృశాధిపకులాదిమపూరుష చంద్రమౌళి పృ
థ్వీదయితాగ్రజుండు నలవీరపనేని ద్వితీయనందనుం
డై దిగధీభ్యసేవిత మహాప్రభుడై మహినేలినట్టి యా
చౌదరి రామనక్షితిపసత్తము వంశవిధంబు దెల్పెదన్.

క. రాఘవపుర ఘనదుర్గా
మోఘితసామ్రాజ్యవిభవముం గొని తన కా
రాఘవపురి రాజ్ధానిగ
శ్లాఘితనయుడగుచు రామ జనవరు డలరెన్. 59

సీ. దుస్సాధ్యులగు బరీదులపౌజు నోర్చి సు
బాకు మెహర్బాను బరపినాడు

పాదుపహాకృపా ◆ పాత్రితముస్తుజా
న్నగరు వాల్లభ్యం బొం◆సర్చినాడు
పేర్మి నందిగ్రామ ◆ రామలింగేశున
కు ముఖమండపము గీ ◆ లొగలిపినాడు
తన సర్వరాష్ట్రమం◆దలి గురుగ్రామాళి
దరు తటాకాదు లేం◆ర్పఱచినాడు

గీ. రాజమాతుర్గంజె నిజపరా ◆ క్రమ వశీకృ
తాన్యరాడ్దత్త వివిధోప◆దా త్తబహుళ
వైభవ పరంపరానుభ◆వజితకులధ
రస్మయవిదారి చౌదరి◆రామశౌరి. 60

ఉ. తారయన్నోభిరామగుణ◆ధారికి రామనభూబలారికిన్
వీరపనేడు రాఘవయ◆విక్రమియుం జినపద్మనాభరా
డ్వీరుడు చంద్రమౌళి పృథి◆వీరమణాగ్రణి రామలింగ భూ
దారుడు నారసింహ వసు◆ధావరు డార్వురుగల్గి రాత్మజుల్.

క. వారలలో నగ్రజుడగు
వీరపనేడు తనతాత ◆ వీరపనేడ
ట్లూరూఢశౌర్యదూరిత
వైరిచమూనాథు డగుచు ◆ వసుమతినేలెన్. 62

సీ. బఱపినాడు సుబాకృ◆పాలబ్ధ బహురాష్ట్ర
దుర్గవర్గమునకు ◆ దొరతనంబు
మఱపినా డాశ్రిత ◆ గురుబుధాదుల కఖం
డార్థదాతృత బర ◆ యాచనేచ్ఛ

నెఱపినా డఖిలార్య•వరగీయమాన మా
నిత యశస్సంపద • నిఖిలదిశల
జరపినాడు స్వద త్తం•సర్వవృత్తులెకాక
విమలపౌర్వికద త్తం•వృత్తులెల్ల
గీ. రాజమాతుఁడెండె భుజపరా•క్రమవిభూతి
ముదితపాదుషహార్పిత•విదితపటహా
ఢమఢమత్కారపాటవా•ఢౌకమాన
నిజమహా స్తతి వీరప•నేఁడునృపతి. 63

క. ఆ వీరపనేనికి బా
హావిలసచ్ఛితకృపాణి•కాళీకపవి
గ్రావీకృత దుర్మదరిపు
భూవిభుఁడగు సూరయప్ర•భుం డుదయించెన్. 64

చ. మగటిమి నప్పసంబు గడి•మన్నె వజీరుల నోర్చి కాంచు స
త్యగుణవదాన్యశీలయుగ•మాత్మధనంబగుచుండ ముస్తుజా
న్నగరును ముస్తుభాన్నగరు•నా గల సహ్యభవోభయప్రతీ
రగురుతరోపవర్తనము • రాజ్యము సూరయ సేసె నున్నతిన్.

క. అనుమితనయుల్ తనయు
ల్చినసరసన చిన్నరామ•లింగం బనగా
జనియించిరి కర్తిరమే
శునకర్త శ్రీనాసిరెడ్డి • సూరయదౌరకర్త. 66

క. ఆయిరువురిలో జ్యేష్ఠుం
డాయత నిజభుజకృపాణ • హారిహృతరిపుభూ

నాయక బలాసుమారుతు
డై యల చిననరసనక్ష♦మాధిపు డలరెఁ. 67

సీ. అమ్మన్నెహంవీరు ♦ డాత్మీయపూర్వభూ
వరులచే మలరాజు♦వారియొద్ద
విలువ కార్జించిన ♦ వినుకొండ పాతిక
వంటూళ్లు నాత్మదా♦ర్బల్యకాల
మందు తద్వంశీయు♦డగు నూగయక్షితీ
శ్వరు డాక్రమింప ని♦స్సైన్యుడయ్యు
నీతికోవిదుడౌట ♦ నిజకమ్మజాతికి
జాత్యభిమానం బె♦సంగ జాబు
గీ. లంపి యాత్మీయవర్ణసై♦న్యంబు గూర్చి
కొని యరిగి బీరవెలిపాయ ♦ నని విరోధి
సైన్యము జయించి నైజరా♦ష్ట్రంబువశ మొ
నర్చుకొనియె యశం బుర్వి♦నాటుకొనగ. 68

మ. స్వవిభుత్వేందిర సీత తద్ధరణ మా♦పాదించు వైరుల్ దశా
స్యవిధానుల్ దనకుంజయంబెసగ ♦ సాహాయ్యంబుగావించు వీ
రవరుల్ వానరసేనగా విమత ద♦ర్పంబార్పుటంజేసి రెం
డవ శ్రీరాముడటంచు జిన్ననరస♦న్నక్ష్మాలోకమెన్నందగున్. 69

క. సతతార్థిలోకకల్ప
క్షితిరుహమన జిన్ననార♦సింహప్రభు డా
శ్రితగురుబుధకవిబాంధవ
హితులకు మాన్యాద్యనేక♦వృత్తు లొసంగెన్. 70

క. ఆయధిపుపిదప వానియ
వీయుడు చినరామలింగ॰విభుడు ధృతధరుం
డై యారోహించె స్వవం
శీయంబగు పాత్రిజ్యరాజ్య॰సింహాసనమున్. 71

సీ. తన నీతిచాతుర్య ॰ మనిశాప్తసామంత
విభుల కుపాసనా॰విద్యగాగ
దన ముఖోద్గళితవా॰గ్ధానంబు తల్లబ్ధ
తల్లజులకు గొంగు॰ముల్లెగాగ
దన ధార్మికత్వంబు ॰ ధారుణీజనపరం
పరకు నోచిన నోము॰పంటగాగ
దన వైభవంబు బాం॰ధవసుధీ ముఖ్యసం
తతికి ముంగిటెని॰ధానంబుగాగ

గీ. జేసి రాజ్యంబు పౌర్వికా॰ర్జిత నిజార్జి
తాఖిలక్షోణిమండలం ॰ బనతే విజయ
ధాటికాధాక్క-ఢమఢమ॰త్కా-రనిర్ద
ళితకుభృత్తతి చినరామ॰లింగనృపతి. 72

చ. కరుణ మహాగ్రహారములు॰గం(డ్రిక లాయన పెక్కులిచ్చె నం
దురువగు గిఁజుపల్లియను ॰ నూరది మాకు మదాద్యలబ్ధమై
జరుగుచునున్న దిట్లుత డొ॰సంగిన శాశ్వతవృత్తు లెన్నియెం
ద అనుభవింపుచుండి రిల ॰ దత్ప్రభుధన్యత నెన్నశక్యమే.73

ఉ. ఈచినరామలింగన మ॰హీపతితాత ద్వితీయసోదరుం
డౌ చినపద్మనాభవసు॰ధాధిపు డాతడు వాసిరెడ్డి వం

శాచలకూటమై భుజబ♦లాతిశయంబున దా ననేకసీ
మాచయమాక్రమించె నల♦మన్నె వజీరుచరిత్రమెన్నెదన్.

—♦ చినపద్మనాభన్నగారి పరిపాలన ♦—

సీ. పటుశౌర్య డీచిన♦పద్మనాభుడు నూత్న
సీమాధికార మా♦ర్జింపగోరి
హైదురాబాదున ♦ కరిగి నబాబు ద
ర్శించి నదరుబెట్టి ♦ చెలిమి సలుప
మఱి సుబాబంట్ల పో♦టరితనంబెఱుగ బె
బ్బులి నున్నతస్థలి♦నిలిపి హయము
దుమికించి యప్పులి ♦ దునుమంగ సెలవిడ
ఖానుజోదులు వెస♦గాక వెఱవ
గీ. దనహయంబు నుడాయించి ♦ దానిదునుమ
నంత నిలువక పెక్కు మో♦హారము లునుప
నెన్నిపన్నిదములు పన్ని ♦ రన్ని దీర్చి
ఫాదుషాచే సెబాస్గిరి ♦ బడసి మఱియు. 75

ఉ. ఫాదుషహాని యోగమున ♦ బశ్చిమదిగ్జయయాత్ర సేసి యా
ఫాదుషహాకు మల్లబడు♦వారి బరీదు మొగల్పఠాణులన్
సైదుల భారసీకుల న♦సంఖ్యచమూచయుల౯ సమిజ్జయా
పాదులనెల్ల నోరిచి సు♦బా కరిగాపుల జేసి మెప్పిడెన్.

సీ. ఫాదుషా యీమెహా♦ర్బా నిట్లు గీల్కొల్పి
చినపద్మనాభు డిం♦పెనయ బేత
వోలును పెనుగంచి♦ప్రోలులోనైన నా
నాసీమలకు జమీం♦దారిసనదు

మన్నెవారీరుసు • మున్నతి గడిదుర్గ
పతులచే గొను వర్త • దారిసనదు
తెల్లజండా పగల్ • దివ్వెటీ భూచక్రి
గొడుగు నాప్తాగిరి • కూనిసెలవు
గీ. నలఘు దేశముఖి పటు • వాజి పటహా
హస్తితురగాదిబహుమతు • లల నబాబు
వలన గొనివచ్చి సత్రింబు • లలనరించి
బ్రాహ్మణావనకారియై • ప్రభుత సలిపె. 77

క. కృతరాజ్యుడగుచు బహుబల
వృతుడై చినపద్మనాభ • వీరవరుండు
న్నతి సీమాంతమహో
ద్ధతశాత్రవజైత్రయాత్రిం • దా గావించెన్. 78

సీ. నమ్మించి తన్ను మో • స మ్మొనర్చిన రామ
రాజు మంత్రిప్ప ఘో • రాజి దునిమె
ఖలుల గోర్కొండి రా • జులనెల్ల జంపి త
త్ప్రబలదేశము వశ • పఱచుకొనియె
శరణన్న సామంత • ధరణీధవులచేత
ప్రతివత్సరంబు గ • ప్పములుగొనియె
మరలబాటిడినజం • పనివారి దునిమి త
త్సీమ మాత్మీయంబు • సేసికొనియె
స్వపరిహాసుల నెరుప్ర • పాలెంప్రవెలమల
హరియించి తద్రాష్ట్ర • మాక్రమించె

గీ. బగతురఁ జయించుమాత్రాన ♦ బగ సడలక
యరులకోటలు దున్నించి ♦ యాముదంపు
వెదలు వేయించె మన్నెహం♦వీరు డగుచు
నరకృతస్తుతి చినపద్మ♦నాభనృపతి. 79

సీ. తనసైన్యధుతరజో♦ధ్వాంతపుంజము మహా
జ్యవనీప్రపంచంబు ♦ నాక్రమింప
దనజయధ్వజమరు♦చ్చాటకుం డరిచమూ
పాలప్రతాపదీ♦పంబు లార్ప
దనయసిచ్ఛద్మభో♦గిని వైరియూథంబు
నిరతానుగతి దీర్ఘ♦నిద్రవుచ్చ
దనజయభేరికా♦స్వనఘంటికారుతి
సంకేతసమయంపు♦జాడ దెలుప
గీ. దళియిదియటంచు రిపుకుభృ♦ద్రాజ్యలక్ష్మి
సమరసంకేతమహి కభి♦సారికయయి
జయరమాదంభళంభళి♦సరణి జూప
వచ్చి చినపద్మనాభరా♦డ్వరు గమించె. 80

సీ. పెట్టించినా డహో♦ పృథులశతఘ్నికా
తత్యభేద్యముగ జం♦తపలికోట
బట్టించినా డాత్మ♦భండనహతశేష
వైరియూథపుల గాం♦తారసీమ
ధట్టించినా డాత్మ ♦ దైనందినౌదార్య
చాతుర్యమున నర్థి♦సముదయార్తి

గట్టించినాఁ డనేకమహేశ్వరాచ్యుత
మందిరప్రాకారమండపములు
గీ. రాజమాత్రుండై జైత్రయాఁ త్రారటత్ప
టహధమత్కారపాటవాఁ ఢౌకితాంక
దశసహస్రచమూ సేవిఁ తనిజచరణ
నతసమకుటారి చినపద్మఁనాభ శౌరి. 81

చ. ప్రణుతసదాన్యు డాతఁడు శఁరన్నవగాత్రమహాప్రతార్పితో
దనముల బోయు నాజ్యములు ఁ ధారుణిఁజేరి కరుల్గుగట్టు నె
ట్టన నవి పారల న్నెలగుఁటఁ ఘటియించిరి నేఁటిపద్మనా
భనృపసమాహ్వయం బఖిలఁ బాడబుల న్నెఱమన్నె వీరికిన్.

క. అతఁ డార్జించిన రాష్ట్రము
లతనికి సుతు లొదవమిం దఁదగ్రభవాగ్రో
దితుఁడగు వీరపనేఁ డను
కుతలేశ్వరుపుత్రపౌత్రఁకులపా లయ్యెన్. 83

— జగ్గన్నగారి చరిత్రము —

ఉ. ఆప్రభుజాతిలోఁపల గ్రఁమాగతరాజ్యుఁడు చిన్నరామలిం
గప్రభుఁడుం దనూభవులఁ గాంచమి దత్కృతరాజ్యమెల్ల ద
త్ప్రపితామహక్షితిపఁ పౌత్రికపౌత్రకుఁడైన జగ్గనా
ఖ్యప్రభుఁ డాక్రమించె నిఁక నాప్రభువంశ్యచరిత్ర మెన్నెదన్.

క. ప్రభ వెలయించిన జగ్గయ
విభుతాతకు తాతయైన ఁ వీరపనేఁ డా

విభునగరితనూజుండై
పరిభవించిన రాఘవయ్య ♦ పరిస్తుతికెక్కెన్. 85

ఉ. కంటకతస్కరప్రముఖ♦గర్వితదుష్టగళాంతరస్ఫుర
త్కంటకు డౌచు రాఘవయ♦గారల పంటలదంటమంటివా
ల్గంటి లలాటభాగతిల♦కంబగు ధాత్రివిభాగలబ్ధమా
గంటిపురంబువంటు వెస♦గైకొనిచేసె బరిపూజ్యరాజ్యమున్.

క. ఆరాఘవయకు బుధమం
దారుడు పెదపద్మనాభ♦నాయం డను దో
స్సారకుమారుడు రూపకు
మారుం డైనట్టి యొకకు♦మారుడు పుట్టెన్. 87

సీ. ఏయోధవరుభుజా♦క్షేయ కౌక్షేయంబు
కఠినార్యసునికాయ♦కాదరివేయు
మేపృథివీశుపరి♦తాపకలాపంబు
సర్వశాత్రవగర్వ♦సాగరౌర్వ
మేభవ్యుజయభేరి♦కాభా. కృతిరవంబు
పరమరాళాసాద♦శరదనాద
మేభూమిపతికీర్తి♦శోభాపరిస్ఫూర్తి
యహితాస్యపద్మాళి♦హారిణపాళి.

గీ. యతడు విలసిల్లు సర్వజ♦నానుమోద
దాయి కృష్ణామహానదీ♦తటనిరంత
రక్షమామండలాఖండ♦రాజ్యభోగ
వైభవబలారి పెదపద్మ♦నాభశౌరి. 88

చ. కరుణ మహాగ్రహారములు • గండ్రిక లాతడు పెక్కు లిచ్చెనం
దులు మునగాలపల్లె యను • నూరది మాకు మదాద్యులబ్ధమై
జరుగుచునున్న దిట్లత డొ • సంగిన శాశ్వతవృత్తులెన్ని యెం
ద అనుభవింపుచుండి రిల • దత్ప్రభుధన్యత నెన్న శక్యమే.

ఉ. ఆపెదపద్మనాభ వసు • ధాధిపమౌళికి పెద్దరాఘవ
క్ష్మాపతి చంద్రమౌళిమహి • జానియు నాగన రామనేత ల
క్ష్మీపతి బుచ్చనప్రభు డ • శేషవిశేషగుణానుభావ చ
ర్యాపరచక్రవర్తులన • నాఱ్వురుపుత్రులు గల్గి రున్నతిన్.

క. ఆయార్వురిలో సరయ దృ
తీయుండగు నాగనక్షి • తిపతి నృపనయ
జ్ఞేయజ్యేష్ఠానుక్రమ
ణాయాత సామ్రాజ్యరాజ్యు • డై విలసిల్లెన్. 91

సీ. స్వవిధేయతాప్రీత • సౌభాగ్యపట్టణ
వల్లభుం డాప్తహృ • ద్వల్లభుండు
స్వపరాక్రమాక్రాంత • సమదాహితనృపోప
వర్తనుం డనఘప్ర • వర్తనుండు
స్వప్రభావశ్రీకు • శలితభూజనసము
దాయకుం డనిశప్ర • దాయకుండు
స్వయశఃపరంపరా • సంవేల్లితాఖిలా
శాంబరు డర్చితా • శాంబరుండు

గీ. నగుచు రాజ్యంబు గావించె • నాన్నృనేత
ప్రబలపరిపంథిబంధుర • ప్రథనవిజయ

ధుర్యబిరుదాంకి తాహార్య♦ శౌర్యహార్య
గణ్యపృతనానిభుండు నా♦గనవిభుండు. 92

ఉ. ఆమహిజానికిం గృతమ♦హాహితహాని కగణ్యపుణ్యదో
ర్ధామనయాదివిశ్రుతులు ♦ రామన జగ్గన నాయడమ్మ నా
గా ముగు రాత్మసంభవులు ♦ గల్గిరి శంభునకుం గుమారక
స్వామియు వీరభద్రుడును ♦ సామజవక్త్రుడు పుట్టినట్టులన్.

క. అందగ్రజుండు రాజపు
రందరు డన రామనృపతి ♦ రాజిలె నిజదో
స్సందీప్తకృపాణపవి
స్పందార్పితవృత్రికుధర♦బలగర్వుండై. 94

సీ. ఆహవకౌతుకా♦యాతవిశ్వామిత్రి
రాజవితానవ♦ర్ధన మొనర్చి
ధర్మదానక్షాత్త్ర♦కర్మ ముంకువ గాగ
శ్రీ జానకీదేవి♦ చెట్టబట్టి
గోత్రాహితప్రజా♦క్రూరత్వ మార్చి జ
గన్మిత్రజాతర♦క్షణ మొనర్చి
హరిబోధముఖ్యసే♦నాఢ్యుడై బహునిష్క
లంకాధిపత్యసు♦లభత బెంపి

గీ. యలవిభీషణముఖశర♦ణాగతప్రి
తీత్యభీష్టదు డౌచు సు♦దారభోగ
మనుభవించె నిజాహ్వా మ♦న్వర్థ మొంద
రవినిభవిభుండు నాగన♦రామవిభుడు. 95

ఉ. ఆతడు షట్ప్రహస్రిప్రతంనాధిపుఁడౌచు బ్రిధానకృత్యముల్
భారిత్రలు దీర్ప జింతపల్లిపట్టణమందున దా వసించి కృ
ష్ణాతటినీతటద్వయలసద్బహుసీమల నావరించి సం
ప్రీతి మహాప్రభుత్వమొనరించె జగజ్జనముల్ నుతింపఁగన్.

క. ఆరామనభూజాసి కు
దారుఁడు రిపుచమూచయవిదారుఁడు బుధమం
దారుఁడు పూజితగౌరీ
దారుం డగు పాపయాఖ్యుదారుడు గలిగెన్. 97

క. ధీరుం డగు పాపయ్యకు
శ్రీరామానాయఁ డనఁగ జిరతరవిభవుం
డౌ రామనాథబాబన
గా రాజకుమారయుగ్మకంబు జనించెన్. 98

గీ. తత్కుమారులకు బితామహుండగు రామ
నృపలలామునకు గనిష్ఠసోద
రుఁ డగు నాయఁడమ్మపుడమిరేఁ డహితాద్రి
వజ్రిధారి యగుచు వన్నెకెక్కె. 99

క. ఆనాయఁడమ్మగారికి
నానాబుధవర్ణనీయనయదానమహో
మానాదిసుగుణగణసం
ధానుం డగు చంద్రమౌళి నా సుతుఁ డొదవెన్. 100

ఉ. తారఖలాధిపుల్ పముజు♦దారుగ సంజన వాడు మీజమీర్
దారుల సూర తెట్టిదని♦న న్వాని ముప్పదిమూళ్ళమేర బల్
కేరుచు నాత్మవాజి దుమి♦కించి సెబాసననొప్పె మన్నెహం
వీరుడు చంద్రమౌళిప్రభృ♦వీవరు డాతడు శూరమాత్రుడే.

క. ఆధాత్రీశునకు బుధా
రాధకు లలపద్మనాభ ♦ రామన్న జగ
న్నాథబా బనెడువారు మ
హాధీరులు కలిగి రిరువు ♦ రవదాతయశుల్. 102

—♦ జగ్గన్నగారి పరిపాలనాప్రశంస ♦—

క. ఏతాదృశమనుజేంద్రుల
తాతయయిన నాయడమ్మ♦ధరణీజంభా
రాతికి నగ్రజు డగు వి
ఖ్యాతుర్ జగ్గన్నగారి ♦ నభినుతి సేతున్. 103

సీ. దూరిపూచ్చాటన♦ధూమకేతుచ్ఛాయ
నిజపృతనాధూళి ♦ నింగి బరవ
విమతయూథపలాయ♦నము జాటిన ట్లాత్మ
భేరికాభాంకృతి ♦ భోరుకొనగ
నార్తాహితాసువు♦లసియాడుచందాన
స్వమహాధ్వజపటాంచ♦లము చలింప
శత్రురాజ్యేందిర♦జడ గైకొనినమాడ్కి-
నాత్మబాహానిశా♦తాసి మెరయ.

గీ. సలిపె నతిమాత్రశాత్రవ♦జైత్రయాత్ర
సమరవిజయాంకవిఖ్యాత♦షట్సహస్రి

సైనిక పరంపరా సేవ్య◆మానుడనుచు
సంగరవిహారి జగ్గన◆క్ష్మాపశౌరి. 104

సీ. తన దోర్మహోరాజ◆తకు శార్వరారిద
ర్పము శార్వరారిద◆ర్పంబుగాఁగ
దనదివ్యసేనాని◆తకు కుధరేంద్రు దా
ర్ఢ్యము కుధరేంద్రదా◆ర్ఢ్యంబుగాఁగ
దనమహాబలసము◆ద్ధతికి స్వప్రతికూల
తరులు స్వప్రతికూల◆తరులుగాఁగ
దనజిష్ణుమాహాత్మ్య◆మునకు వృత్రబలస్మ
యంబు వృత్రబలస్మ◆యంబుగాఁగ
గీ. నఖిలగణిమన్నె దేశంబు ◆ లావరించె
జటులపటహాఢకమదప్రవ◆స్ఫుటితదిక్ప్రి
ఘటితధాటీ నటచ్చమూ◆త్కటితురగర
జఃపిహితహేళి జగ్గన◆క్ష్మాపమాళి. 105

సీ. లలి గిలార్చుచు మూఁక ◆ లగ్గపట్టించి గ
గ్గోల్సేసిరాదీసె ◆ గొండవీడు
శౌర్యంబు మెఱయ మీస◆ముదువ్వి మార్తుర
వెఱపించి చేపట్టె ◆ విన్నకొండ
నెదిరించు మన్నీల ◆ నదలించి సన్నీల
గుప్రిమ్మించి గైకొనె ◆ గొండపల్లి
కలివీరభద్రుఁడా ◆ చులికి విరోధిరా
ధులు వార సాధించె ◆ బిలముకొండ

గీ. ఖోర నోహరి సాహరి ◆ మోహరించు
దిట్టలజయించి కంబము◆మెట్టుముఖ్య
దుర్గవర్గంబు స్వావశమం◆దున ఘటించె
మన్నెహంవీరు డగుచు జ◆గ్గన్నగారు. 106

ఉ. ప్రప్రహితామహక్షితిప◆పౌత్రికపౌత్రిక చిన్నరామలిం
గప్రభుపాలితంబు నది ◆ గాక నిజార్జిత మేతదృక్సమ
స్తప్రబలోపవర్తనము ◆ జగ్గనృపాలకు డేకహేళిగా
దీప్రయశంబు దిక్తటిల◆దీటుకొనఁగ నడిపెం బ్రభుత్వమున్.

సీ. పాదుషాహీ మొహ◆ర్బానులూనిచి మహా
పారితోషికములు ◆ బడసినాడు
కమ్మబెబ్బులియన ◆ గడిమన్నెదొరల నో
డించి గడీ లాక్రి◆మించినాడు
హరిహరాలయకూప◆తరుతటాకాదులు
నిజరాష్ట్రమందెల్ల ◆ నింపినాడు
భూరిమాన్యము లగ్ర◆హారంబులును మొఖా
సాలు జాగీరు లొ◆సంగినాడు

గీ. స్వవితరణ హర్షితప్రాజ్ఞ ◆ వరనుతాత్మ
సత్కథాకర్ణనాసహ్యా◆సమదలోభి
విభుముఖాబ్జ సుధాకర◆ద్విప్రులకీర్తి
వేల్లితాశాళి జగ్గయో◆ర్వీపమౌళి. 108

చ. కరుణ మహాగ్రహారములు◆గా నొసరించిన వాటిలో సుఖం
కరమగు బాలెమర్తి యను◆గ్రామముమాకుమదాద్యలబ్ధమై

జరుగుచునున్న దిట్లతఁడొంసంగిన శాశ్వతవృత్తు లెన్ని యెం
ద అనుభవింపుచుండి రిల • దత్ప్రభుధన్యత నెన్నశక్యమే.

క. ఆరీతి నెసగు జగ్గ
క్ష్మారమణాగ్రణికి నమృత • జలధికి నంభో
జారాతికరణి బుధమం
దారుండగు వేంకటాద్రింనాయఁడు కలిగెన్. 110

—•రాజా శ్రీ వేంకటాద్రినాయుడు బహద్దరుమన్నెసుల్తానుగారిప్రశంస•—

సీ. అతఁ డంఘ్రివిన్యాసింయగునాఁడె తన్నూత్న
యశము దిక్తటముల • నంకురించె
నతఁడు విద్యాభ్యాసింయగునాఁడె తద్గుణా
వళి తదజ్ఞజింహానిం వాసియయ్యె
నతఁడు ఖళూరిక•నడగునాఁడే తన్మ
హాస్సు విద్వట్చుర్య • లడ్డగించె
నతఁడు రాజ్యారంభిం యగునాఁడె తద్రిపు
ప్రజ మటవీకరిమా•రంభియయ్యె
గీ. రాజమాతురిండె దర్శనా•ర్థ కృతశత స
హస్ర నిష్కపథార్పణాంజనరిహార్షి
తయనవేడ్కత్తె మన్నెసుంల్తానుబిరుద
ముద్రితవిభుత్వతతి వేంకంటాద్రినృపతి. 111

మ. సతతైశ్వర్య కపాలపాలిత సుహృంత్సదాజి రాజీవభూ
చతురాలాపవిహారహారిరుచిభాంస్వ స్మూర్తి మూర్తీకృతా

ర్యతులాటవ్యూరుకీలి కీలితగుణోద్యత్కంధి కంధీశతు
ల్యత రాజ్ఞా పరిపాటి పాటిత కుచోద్య వ్రాతు డాతండగుణ.

సీ. కరియే యసీధు సంగతి తలపడకు డొం
దియును మాతంగి కాప్తి విడడయ్యె
హరియేమి శుక్రియను కరుడు వృద్ధుండయ్యె
నెద భుజంగీసక్తి వదలడయ్యె
కిరియే యపంక సంచరుడు ముదుకుడయ్యె
బారదారికవృత్తి బాయడయ్యె
గిరియే యకూటి దుస్తరవయఃక్రముడయ్యె
మరి రంకువర్తన మానడయ్యె
గీ. ననుచు కరి హరి కిరి గిరులను హరించి
పృథివి వేడ్కనవారణ విభునశేష
భోగి యక్షయసౌకర్యపూర్ణుడవన
ముద్రి యగు వేంకటాద్రి ప్రభుని వరించె. 113

చ. స్వకృతవిభుత్వవేళను సబాబధికారము వీడి హుణాప
త్య కలితమై విదర్భ మలరారుట హుణవిధేయుడౌచు హా
యికలుగ వారిచే స్వమహియిస్తిమిరాసన బొందిసాగాను లు
త్సుకలుగ వేంకటాద్రిమహిధుర్యుడొనర్చె మహాప్రభుత్వమున్.

సీ. అష్టదుర్గాసటీహంపీరరతిపతి
చౌశీతిగజఘటాచక్రవర్తి
జన్నిగట్టడిగుత్తజట్టి మల్లుడు మన్నె
హంపీరబిరుదు రాజాధిరాజ

బిరుదు రాజ్ బహా♦దరు మన్నెసుల్తాను
సరుదేశముఖు మహా♦బిరుదు రెడ్డి
కర్నాట నృపరమా♦కమనుండు గడిదుర్గ
గండరగండఁడు ♦ కదనవిజయ

గీ. వీరశంకరబసవ హం♦వీరమన్నె
రాయ పరరాజభీకర ♦ రాజచంద్రి
బిరుదుఁడై వెంకటాద్రి భూ♦విభుఁ డశేష
జనులు జయవెట్ట ప్రాజ్యరా♦జ్యంబొనర్చె. 115

మ. కలిత స్ఫోటకరోగహారియగు టీ♦కావైద్య మింగ్లాండునం
దలిదీ హిందువులొప్పకున్న హితబో♦ధన్ వశ్యలంజేయ రం
జిలి యవ్వానికి క్లైవుగొనరు ఘటిం♦చెన్ రాష్యపుంబళ్లెరం
బులుపా తాదృశ వేంకటాద్రి నృపమా♦న్యుం డెన్న
సామాన్యుఁడే.

మ. వరిగొండమ్మరనేని కొల్వకొలన♦ప్పారావు మల్రాజు కీ
సరమానూర్వెలిగోటిరావు కలిదిడ♦శ్వారావు మాణిక్యరా
వరిబండేరులగడ్డ కాండ్రెగులము♦ఖ్యానంతసామంతభూ
వరు లౌరాయన వేంకటాద్రవిభుఁడై♦శ్వర్యోన్నతిన్ శోభిలెన్.

సీసమాలిక. చాముండి కామరే♦శ్వర సౌధమంటప
ప్రాకాం గోపుర♦ప్రౌఢికారి
ప్రతిచండికా నవ♦రాత్రి వ్రతాయుత
దంపతిపూజైక ♦ ధన్యమూర్తి
యఖిలపుణ్యస్థలా ♦ ధ్వాన్న సత్రస్థాపి
క్రౌంచపట్టణపుస♦ద్గ్రంథకర్త

శతమహాక్రతు పుణ్య♦సంపాదకుడు సదా
ద్విజభుక్తశేష భో♦క్తృనియముండు
దినదిన పార్థివ♦ దేవసమర్చన
కరుడు పంచాక్షరీ♦ కర్మరతుండు
లలితసాలగ్రామ♦ లక్షదుం డష్టోత్త
రశతకీర్తిధ్వజ♦ రచనవిదితు
డద్వైతమత రహ♦స్యజ్ఞాని గోదాన
నృగరాజు నిర్మిత♦ నగరదశకు
డసకృత్సుధీప్రసం♦గాకర్ణన రతుండు
బహుసప్తసంతాన♦ మహితసుకృతి

గీ. సర్వ సర్వంసహాదేవ్య♦ ఖర్వరత్న
దివ్యసీమంతదమరావ♦తీనిదాఘ
రాజ్యసింహాసనస్థుడై♦ ప్రభుతసలిపె
వేంకటాద్రి మనోధృతి♦ వెంకటాద్రి. 118

మ. ధరణీశుల్బహుమంది లేరె కనమే♦ తచ్చర్య లెవ్వారు న
ర్వర విప్రాళికి వాసిరెడ్డికుల స♦మ్రాడ్వేంకటాద్రీంద్రువై
ఖరి మాత్రోస్యుక్తహిరణ్యగర్భమఖముం♦గావించి స్వావేశితో
త్కర తద్భర్మపిటం బలక్ష్యమతి వ్ర♦క్కల్జేసి పంచిచ్చిరే.

సీ. అగ్రజన్మల కగ్ర♦హారముల్ నూఱూళ్ల
మరచినా డిడినవి♦ మరచినాడు
భర్మరాసుల తులా♦భారము ల్మమ్మారు
దూగినా డయ్యావి♦ మోగినాడు

తనరాజధానులం◆దు ననేకసౌధాళి
దీర్చినా డార్యుల ◆ జేర్చినాడు
పండితులకు బైడి◆పాత్రల నన్నం బో
సంగినా డవియు నో◆సంగి నాడు
గీ. స్తంభశైలశ్రితాద్రి ప్ర◆ధానదుర్గ
దశకపరిపాలనాఢౌకి◆తప్రభుత్వ
సుఘటితాశాంత కీర్తిధ్వ◆జుం డతండు
నృపతిమాత్రుండె వెంకటా◆ద్రిప్రభుండు. 120
చ. సరసులపాలిజీవనము ◆ సంతత మర్థులకొంగుముల్లె భా
స్వర కవిరాజి కుద్గమిత◆పద్మనిధానము మిత్రపాళికిన్
భరితవసూత్కరంబు బుధ◆పంక్తికినిష్కుటకల్పకంబు పో
స్థిరముగ వెంకటాద్రి నర◆దేవశిఖామణియావి మాయుశే
సీ. ఆశ్రితాది చతుస్స◆హస్రప్రజాధూర్వ
హనకాశి సేతుప్ర◆యాణకరుడు
యాత్రార్థతత్రిత◆తార్పణసమయ హూ
ణాధీశ కోశవి◆న్యస్తధనుడు
యానపురాత ద◆బ్దాకరాపాది హూ
ణాదేశి సేతు కా◆శ్యనుగమనుడు
శతసహస్రప్రధో◆త్సవిత బాజీరావు
పేష్వాభిదర్శన ◆ పృథుకృతార్థు
గీ. డగణితద్విజ పుణ్యతీ◆ర్థార్థిదాన
రచనపూర్వక విశ్వేశ◆రామలింగ

దేవనిష్కాభిషేక ప్రి♦దీప్త సుకృతు
డతడు రాణ్మాతుౕడే వెంక♦టాద్రివిభుడు. 122

క. సుమన స్తతి సుమనోబ్భం
దము జాహ్నవికృష్ణనంద ♦ నము నందన మ
య్యమరావతి యమరావతి
యమరేంద్రుడు వేంకటాద్రి ♦ వైయతడలరెన్. 123

క. నిత్యైశ్వర్య సుఖంబుల
నత్యున్నతుడైన యాత ♦ డాముష్మిక సం
పత్యాధికారనైకా
పత్య శ్రీసుఖమునం ద♦భాగ్యుండయ్యెన్. 124

—♦ వెంకటాద్రినాయుడుగారు రెండుదత్తతలు చేసికొనుట ♦—

ఉ. బాపురె నిస్తసూజవిభ♦వంబు నిరర్థకమంచు గీర్తిల
క్ష్మీపతి వెంకటాద్రి నృప ♦ శేఖరు డాత్మ పితౄణ మోచన
శ్రీపరమానురక్తి దన ♦ జ్యేష్ఠకనిష్ఠ పితృవ్యపుత్రులా
పాపయ చంద్రిమౌళులను♦వారితనూజుల నిర్వురన్ రహిన్.

సీ. సభ్యోక్త ధర్మశా ♦ స్త్రప్రకారంబున
నంగీకరించె దా ♦ నాత్మజులుగ
వారిలో బ్రియంపు ♦ వ్యత్యయస్థితిబట్టి
ఘను జగన్నాధబా ♦ బనెడువాని
జ్యేష్ఠునిగా నిజ♦జ్యేష్ఠపురంధ్రికి
నలరామ నాధబా ♦ బనుకుమారు

నిగనిష్ఠునిగ స్వక • నిష్ఠపురంధ్రిక
నిరువురు సతులకు • నిరువురాత్మ

గీ. జులగ్రిమంబున దత్తత • నలవరించె
స్వాన్వయం బభివృద్ధిగా • నంత దత్కు-
మారులిర్వురు రామల • క్ష్మణులమాడ్కి-
మహితచర్యల నభివర్ధ • మానులయిరి. 126

గీ. రహి జగన్నాథబాబును • రామనాథ
బాబనెడి పుత్రు లనిశంబు • భక్తిదన్ను
గొలువ గజముఖ షణ్ముఖుల్ • గొలువ నలరు
మృడునివలె వెంకటాద్రినా • యడు సెలంగె. 127

ఉ. ఆ విధినొప్పుచుం గడున • యంబున రాజ్యము జేసిచేసి యా
త్మోన్నవిభు డస్త్రచంద్రవసు • సద్ధవహాయణశకాబ్దమందు నా
నావసుధాజనవ్యధగ • నాకము జేరె స్వదీప్తిదిక్కు- లెం
తేవెలయించి భానుడు తు • దిం జరమాద్రికి వ్రాలువై ఖరిన్.

క. ఆనృపుపిదప విశ్వ నయసం
ధాని జగన్నాథబాబు • ధరనేలగ సం
స్థానిక వృద్ధనియోగము
చే నారోపించె రాజ్య • సింహాసనమున్. 129

వ. అట్లారోపించి.

క. క్షితిధుర్వహుడై గుణసం
గతుడు జగన్నాథబాబు • గా రఖిలజన

పరితతికి సుఖమొదవగ సయ
యుతమతి రాజ్యంబొనర్పు♦చుండిన నచ్చోన్. 130

—*రామనాథబాబుగారిక జగన్నాథబాబుగారికి కలహప్రారంభము.*—

మ. తనయస్వీకృతి నిర్వ్యాకిగయికొనె♦న్దన్నున్నను న్వెంకటా
ద్రినృపాలుండు తదీయసర్వవిభుతా♦శ్రీనిర్వరంబూనగా
జనదో తద్విధిమానె తానొకడె రా♦జ్యంబెల్ల బ్రాపించె నీ
జననాథుండని రామనాథనృపుఁ డీ♦ర్ష్యాక్రోధఘూర్ణాత్ముడై.

చ. ఇతరపురస్కృతింగడగి♦యీయనయీయనయంబుచే నిరా
దృతిననుజేసి సర్వమహి ♦ నేలగ నేల గరీబునట్లు స
మ్మతిపడనాకగుం బ్రభుత♦మాసన మాని సరుండగాను రా
ష్ట్రతతి మదంశమున్గొనుదు ♦ రాజిల రాజిల నీతడేయనన్.

మ. అనిభావింపుచునుండనానృపుమనో♦వ్యాపారమూహించి గ్ర
ద్దననాత్మేచ్ఛ ఫలించెబోయని ప్రమో♦దంబంది సంస్థాన స
భ్యనికాయంబులలో దడా ప్తులగు వా♦రారామనాథక్షితీం
దుని వేసారకమంతనంబున బ్రభూ♦ద్యోగాతురుంజేయుచున్

సీ. తనయులిర్వురుగాక ♦ తానొక్కడే. వెంక
టాద్రినాయనిగారి ♦ కనెడువారు
నెందఱు సుతులున్న ♦ నందఱుగారకో
జనకుసొత్తుకు కర్త ♦ లనెడువారు
విధిమెరింగియ దండ్రి ♦ వీరి కిర్వురకు ము
న్నవని విభాగించె ♦ ననెడివారు

నాదిన నీ వాద•మాడిన నిపుడింత
యత్నంబువలదుగా • యనెడువారు
గీ. నిప్పుడైన నేమి • నీజగన్నాథ బా
బధిపు ప్రాభవంబు • నాగి రామ
నాథబాబుభూమి • సాధు నర్ధప్రాభ
వంబు దెత్తుమనెడు • వారు నయిరి. 134

ఉ. ఆదట రామనాథనృపు • డాత్మమనఃకుతుకానుకూలసం
వాదులలో బ్రధానులగు•వారలతో మనకింక రాజ్య సం
పాదక హేతుభూతమగు • పద్ధతినారసి పల్కుడన్న వా
రాదృతి సావధానమతి • నారసి యిట్లని రానృనేతతోఁ.

మ. మనకున్ముందర సంధివేడనగు న•మ్మర్యాదకు న్వార లో
ప్పనిచో శిక్షణదక్షులైన యయికో•పావారిన్యాయంపుకో
ల్వ్యాన దావాయిడి ఫైసలా వరకు తా•లూకాలుసర్కారుజ
ఫ్తుననుంచఁ దరఖాస్తు పెట్టి హుకుముం•బుట్టింపగర్జంబగుఁ.
కం. దొరతనము వారికుండిన
వెఱతురు నిజమాడనెవరు • విభుతె నమాని
న్నెఱయించిన నందఱు మది
నరయుదు రుభయులను సరిగ • నది మేలొసగుఁ. 137

చ. వడి తగవాఖరావఱకు • వారివశంబున రాజ్యమున్న రా
బడి సకలంబు వారికగు • పంపిడితీరుపునొంది వారిచే
బడినదిః యర్థ్యరస్థాన న•పారపుకష్టముగాన నెన్నిటం
దడవిన వారికిం దొరత•నంబుదొలగంగజేయుటొప్పగుఁ.

క. దొరతనము దానిమైవజు
సరకారెత్తున బిగింప • జను నపైనర్
గరిమంబుడుగు న్మనతో
సరియగుదురు వారు దాన • సంధియకలుగర్. 139

మ. అనివిజ్ఞాపనమాచరించుటయు నా•హ్లాదించి యాతండెదర్
మనమాది న్వినయంబెచూపుదము దా•ననాశ్రికాకున్న గ్రి
క్కున నర్జీయిడినంతనే మనకహో• గుంటూరుజిల్లాప్రభుం
డనఘుం డోకను మత్ప్రియుండతడు నే•యంజాలడేయిప్పనిర్

—*రామనాథబాబుగారు జగన్నాథబాబుగారికిరాయభారమంపుట *—

చ. అనితలపోసి యంతట ని•జాగ్రజుపాలికి నొక్కరాయభా
రిని దనకర్ధరాజ్యమును • బ్రీతినొసంగిన మంచిదంచు పం
చిన నతడేగి వాచికము • చెప్పినచో విని వీక దోకద్రొ
క్కిన పెనుచిల్వచెల్వున నొ•గింగనలూని యతండు తజ్జనుల్.

ఉ. తానట వెంకటాద్రినసు•ధాపతి రెండవద త్తపుత్రకుం
డౌనట దద్విధిందనకు • నర్ధవిభుత్వము బంచియివ్వగా
నౌనట యియ్యకుండినర•యంబునహూణులకొల్వులందు దా
వానెరయించి పాలుగొను•వాడట హా యిటువంటివున్నవే.

క. ఎక్కడి రెండవదత్తుం
డెక్కడి భాగంబుదనకు • నెందరసినచో
నక్కటదత్తతనూభవు
లొక్కనికిన్ ధాత్రినిరువు • రుండుటకలదే. 143

ఉ. భ్రాతనటన్న మాటవిన ♦ బల్కకయందఱుదాయలంబర్లె
జ్ఞాతినటంచు నర్మమగు ♦ చాడ్పున వేడిన జీవనాంశమున్
ఖ్యాతిగనిత్తుగాక విధి♦గానికుతూహల మాత్మబూని యీ
రీతిభయంకరోక్తి బెద ♦ రించిన భీతిలి భాగమిత్తునే 144

క. తనకోకసుగారుండిన
ఘనమచిలీపట్టణాధి♦కారి రసూల్మా
కునులేడె యెవరికెవరుం
డిన రూలెట్లట్ల తీర్పు ♦ నెఱపుదురు దొరల్. 145

మ. మొగలై రాజ్యముకాదుగాయిదినయం♦బుందప్పిపో రాడిచా
వగ నెవ్వారును నూలుపోగునను చే♦వందక్కి బంధింపగా
దగియున్నారముకాదెధార్మికవిభూ♦త్తంసంబు లాంగ్లేయులం
పగు"లా" నెన్నక రామనాధునకు రా♦జ్యంబున్ని రూపింతురే.

సీ. మునుపు బృందావనం♦బున కొక్కతరి కల
క్టరు మేస్తరు రసూలు♦గారి నేము
గనబోవ నెదురుగా♦జనుదెంచి మముగొని
చని సరిగద్దియ♦నునిచి కుశల
పృచ్ఛగావించి యా♦ పిదప నానావ్యవ
హారంబు లడుగు చి♦ట్లనియె నతడు
రాజా భవత్సోద♦రబ్రువుం డలరామ
నాధబా బటకు ము♦న్వచ్చినపుడు

గీ. నస్మదగ్రజువలన మ♦దర్ధరాజ్య
సమితి నిప్పింపుడనిన యు♦ష్మద్ద్వితీయ

దత్తతనిషిద్ధ మిప్పింప • దగవె సగము
సొత్తు మీ కంచు నంటిమం • చునువచించె. 147

ఉ. న్యాయముదప్పియే క్రమము • నందనకుఁ బ్రభుతన్ఘటింతురాం
గ్లేయులు రూలుకాని పని • లేశముగా దిటువంటిపూనికం
జేయకయున్న గౌరవము • సేతు మమీరులతో సమంబుగా
బాయక ఖర్చుకత్తుము సు • వారపువారలతో సమంబుగన్.

క. తన కీ రాజీపద్ధతి
కనుకూలంబైన మాకు • ననుకూలంబే
తనకిష్టము గాకుండిన
దన మదికిం దోచినట్లు • దా జరుపదగున్. 149

మ. అనియీలాగున జల్కెనారమని మీ • త్పాధీశుతో బోయి గ
న్నన వాకుచ్చిమ్ము నీవటంచలజగ • న్నాధక్షమాజాని చె
ప్పిన దోడ్తోజని రాయభారి వెసనా • వృత్తాంతమున్ సర్వము
న్వినుపింపన్విని రామనాధనృపుడు • ద్వేలాగ్రహస్వాంతుడై

మ. అవురా న్యాయములేడ రాజులకు రా • జ్యాసక్తచిత్తంబులే
డ వచోమాత్రముచేనొడంబడుటరా • ద్వంశంబునందున్న బ్రా
భవలోపంబున మున్న నేకులు మహీ • పాలపరి వీరుల్మహా
హవరంగంబున వేపరస్పరజిగీ • షాయత్తులై చత్తురే.

క. ఆయుధకాలంబిది కా
దాయెగదా కలముకాల • మయ్యె నయిన నా
దాయయు నేనును నీయా
దాయమునకు సంతుగాంచ • దగు నుచితగతిన్. 152

చ. క్షితిని ద్వితీయదత్తతమె • చెల్లకయుండిన సభ్యులెట్లునస
మ్మతివహియించి రెట్లునయ•మార్గవిదుం డలవెంకటాద్రిభూ
పతినను స్వీకరించె దన • ప్రాభవము న్విభజించిముందునీ
గతి జరిగించుడంచు సర • కారునకాయన వ్రాసెనె
ట్లుయల్.

సీ. స్థవిరుండనైతి గా • త్రిబలంబుదొలగె నా
మన మీశ్వరాంఘ్రి ప•ద్మములజేరి
సుఖియింపుచున్నది • సుతులకు రెండుభా
గములు మద్దానధ•ర్మముల కొక్క
భాగంబు నిట్లేము • బ్రతికియుండినవఱ
కటమీద బుత్రిద్వ•యంబునకును
రెండుపా ళ్లిస్మదా•ర్జితసమ స్తప్రాభ
వంబిట్లు జరిగింప•వలయుననుచు
గీ. దనచరమవేళ మన్నెసు•ల్తానుగారు
వ్రాయునర్జీలు కంపెనీ•వారియింట
నింటనై యుండవే వాని•గెంటివేయ
నెవ్వనితరంబు మద్భాగ•మెట్లుదప్పు. 154

మ. అదిగో కోకసుగారు పూర్వమున నీ•వ్యాపారమాలించి నా
మది నీకున్నగముం బ్రభుత్వము ఘటిం•పంగోరి యున్నాడ జే
సెదసాహాయ్యము నిందు నెంతయిన నీ•క్షేమంబె నాక్షేమ మీ
వెద లెక్కింపకు దీనినంచు నభయం•బిచ్చెంగదా కూరిమిన్.

క. ఏకరణి జగన్నాథ
క్ష్మాకాంతుడు నాకు బ్రభుత•సగమొసగక దా

నేకాతపవారణముగ
లోకము పాలించునో వి॰లోకింపవలెన్. 156

వ. అనుచుండ దదీయులిట్లనిరి.

క. చూచునదియేమి సంతత
మాచతురు డశేషరాజ్య॰మనుభవమొందన్
నీచుగతి మనను జూడగ
యాచకువలె నతనినడుగ॰నగునా మనకున్. 157

ఉ. ఏలయుపేక్ష సహ్యాజకు॰నీవలనావల నున్నయట్టి తా
ణాల త్వదీయసైనికగ॰ణంబు నియోగమొనర్చి భూప్రజా
పాళి వశంబొనర్చుకొని ॰ వారిజనంబు నెదిర్చి దేశముం
గాలమెటింగి శిస్తులు స॰గంబు వసూల్ పరిపింపగాదగున్. 158

—॰ రామనాథబాబుగారు అర్ధరాజ్యమును ఆక్రమింపబూనుట ॰—

క. అని స్వీయులు తనతో మం
తనముం గావింపనతడు ॰ తదుచితసైన్యం
బొనగూర్చి యెవ్వరెచటికి
జనిమెదరో చనుడటంచు ॰ సరవి ననుటయున్. 159

సీ. చేబ్రోలుతాణాకు ॰ జెచ్చెర నొక కొంత
జనముతో జని పని॰చక్కబఱతు
వే కూరపాటితా॰లూకాకు గొంత సై
న్యముతోడ నేగి కా॰ర్యంబొనర్తు

గొండపల్లిముతాకు ◆ గొంత రాణువతోడ
బర్వి యుద్యోగంబు ◆ నిర్వహింతు
చేతవోలుమహికి ◆ పృథుభటశ్రేణితో
నరిగి పరిభుత్వంబు ◆ నలవరింతు

గీ. నేనునేనంచు నంద ఱిచ్ఛానుసరణి
తవర నేతెంచి చేసిరి ◆ తాణుబంది
శివి నవ్వాసిరెడ్డి యె◆స్టేటులందు
సరగ నారామనాథేభ్యు◆తరపువారు 160.

శా. వారింజూచి విచిత్రమంచుచువహ◆వ్వారాజ్యముం జేయగా
దారేతెంచిరొక్కో యటంచును జగ◆న్నాథాధిపోద్యోగు లే
పారం దత్సుభటప్రధానఘటిత◆ వ్యాసారము ల్సాగనీ
కారాటంబులుమాన్పిపంపిరొగిమై◆నాయాతమార్గంబునన్.

ఉ. ఆదురవస్థ కాత్మ విల ◆ యానలుపోలిక రామనాథ గో
త్రాదయితుండు మండిపడి◆క్రిన్ననొండొరుదొమ్మిజిమ్మగా
గాదగినట్టిదేమి సర◆కాదన గెల్చినగెల్పు గెల్పిక
న్వాదముచే దివాణమున ◆ వారలనాబలముంగనంబడున్.

చ. చతురశరాసనాన్వితుని◆సాయక మొక్కనిజంపు జంప కు
న్నతగతిమైదొలంగి చని◆నం జను బో మఱి నీతిపాటవా
న్వితుని నయప్రభావ మది ◆ విద్విషనాశమొనర్చు దన్మహా
క్షితితలమున్ జయించునని◆చెప్పిరికాదె పురాణపూరుషుల్.

క. జలధిం దీతువ దంతా
వళపరిపంథిన్ శశంబు ◆ బకము గుళీరం

బల నీతిచేతగాదే
గెలిచె నరుం డేల నీతి • గెలువ డరాతిన్. 164

క. అలఘుతర నీతివిద్యా
బలము బలంబగునె కాక • బలువిడిదొమ్మిం
గలహించు బలము బలమే
తలపోయ నఖండ నీతి•తత్త్వజ్ఞునకున్. 165

క. కలహం బుభయుల కణపగ
గలరధికారు లికనేల • గలహము మనచే
గలముండ నిక్కలంబే
కలమై యాపత్పయోధి • గడతేర్చు వెసన్. 166

ఉ. కావున న్యాయకర్త లధి•కారులు నైన ఫరంగులొద్ద దా
వావెలయించి ప్రాభవవి• భాగము ఫైసలొనర్చునంతకున్
వావిరి హూణు లియ్యుభయ• వాదులకుందొలగించి తారెరా
ష్ట్రావన మాచరింపుచును • నైవ జనామతునుంచునట్లుగన్.

—* రామనాధబాబుగారు రివిన్యూయిలాకాను వ్యవహరించుట *—

మ. దరఖాస్తుల్ఘటియింపబోలుననియం•తన్ బైత్రుకంబగ్రిజ
చరితప్రాభవమందు నర్ధవిభుత•న్సాధింప గుంటూరు బం
దరుజిల్లాల కలెక్టరుప్రభుల యొ•ద్దన్ రామనాదేభ్యు
క్షరవాక్షాధినకీళ్ల మూలముగ దా•ఖల్ సేసె దావా వెసన్.

క. దావాతోడనె నిడె నీ
దావాఫైసలగువఱకు • తారే మా రా

ష్టాపనము జేయు చందలి
మైచజును డిపోజిటుంచు ♦ డని దరఖాస్తున్. 169

గీ. అట్లు ఫిర్యాదు దాఖలై ♦ సంత నుభయ
పహుణభర్తలు పబ్లీకు ♦ హుకుమువలన
నజ్జగన్నాధబాబున ♦ కవ్వివాద
వార్తదెల్పిరి తత్ప్రతి ♦ వాదమునకు. 170

శా. నోటీసందగనే మహోగ్రుడగుచుం ♦ దోడ్తోజగన్నాధబా
బాటోపించె నితండయారె సరకా ♦ రాఫీసుల న్వాద మే
ర్పాటుంజేసెగదా యశాస్త్రమత చ ♦ ర్యన్బాని యేపాటినె
చ్పోటందీనిజయించునోగనవలెన్ ♦ సూయంచుసూయంచిడెన్. 

క. ఆయెడ దద్వార్తన్విని
ఖాయంబగుబెట్లు రూలు ♦ కాని వివాదం
బీయనచేసిన మాత్రినా
హోయని ప్రతివాదివార ♦ లొండొరుదమలోన్. 172

సీ. జూడేశయాలధీ ♦ శులయొద్ద జేయంగ
నైనదికాదె యీ ♦ వ్యాజ్యమరయ
సీవిల్‌హాజారాల ♦ జేయంగదగినదే
గతిరివిన్యూయిలా ♦ కానుజేసె
జేసినచోనిది ♦ చెల్లదిందనకయే
కైవడి బట్టిరో ♦ కల్కటరులు
పట్టిననేమి త ♦ త్ప్రతివాదమాలించి
తోన దావా వారు ♦ తోసివేతు

గీ. రకట నిలవనిదాని నం♦దలవరింప
నిందుకోహో యిదేటి పం♦ల్కుందుగాక
నింకనొకచో జయించునే ♦ యీవివాద
మీనృపాలుడు గెలువలే ♦ డింత నిజము. 173

క. అనుచు జగన్నాథ మహా
వనిపతి పక్షమున నున్న♦వార లలక్ష్యం
బుననుండిరంత బ్రితివా
దనమున కేర్పడిన వాయి ♦ దాగదియుటయున్. 174

మ. తనకై ఫీయతు నక్కలక్టరులకు ♦ న్దర్యాస్తుకై బంపె గ్రి
ద్దన నమ్మేటి వకీళ్లమూలముగ నీ♦దావా రివిన్యూన దే
జనదా సీవిలురీతి దైనను విమ♦ర్శంజేయుడీ మీరు నొ
క్కనరుండిర్వురదత్తపుత్రిలసహో♦గై కొంటశాస్త్రీయమే.

ఉ. వాది ద్వితీయదత్తతయె ♦ భావ్యముగా నటులైన జ్యేష్ఠమ
ర్యాదను బట్టి నాయడియ ♦ ప్రాభవమట్టిప్రభుత్వమందు నీ
వాదికి భాగమెట్లొదవు ♦ వంశజుడౌట స్వజీవనాంశమే
మాదృతినిచ్చువార మన♦యంబనియానసర్క్ ఘటింపగన్.

క. ఆయర్జీనానసరును
నాయుభయులొనర్చు సాక్ష్య ♦ మాపై ఋజువుం
బాయని దత్తయివజులును
నాయావత్తు రికార్డు ♦ నక్కల్కటరుల్. 177

ఉ. ఆగసి తీర్పులేర్పఱచి ♦ రందలబందరు భర్త యా రసూ
ల్గాణిది చిత్తగించితిమి ♦ లావిధిజెల్లదు రామనాథ భూ

దారగతద్వితీయతర♦దత్తతగావున మద్వశంబునం
జేరిన వారిరాష్ట్రమును ♦ జేర్చితిమి ప్రతివాదిగారికిఁ.

మ. అని యుత్తర్వీడె నంత నోకసురికా♦ర్డాలించితి న్వేంకటా
ద్రినృపాలార్పితభాగనిర్ణయపుట♦ర్జీ లున్నవిం దట్లు గై
కొనబో లిర్వురురాజ్యమంచు దనదా♦గుంటూరుజిల్లాను క
ల్గిన తద్రాష్ట్రము వారలిర్వురునుపా♦లింపంగ నుత్తర్వీడెఁ.

క. ఆదొరలిడు తీర్పులు విని
వాదిప్రతివాదులు తదు♦భయపక్షచరు
ఖేదాహ్లాదాంకూర
ప్రాదుర్భావాత్మహృదయు ♦ లైరటుమీఁదన్. 180

—* రెవిన్యూబోర్డుకు ఉభయవాదులు అప్పీళ్లుచేయుట *—

క. వడి కల్కటరులతీర్పుల
కొడబడ కప్పీళ్లుజేసి ♦ రొండొరు గెలువం
గడిమిని నిరువురు వాదులు
నడరి కలెక్టరులమీఁది♦యధికారులకున్. 181

వ. అంత.

క. అయ్యప్పీళ్లను రెంటిని
సయ్యన నొకకేసుజేసి ♦ సకలమగు రికా
ర్డయ్యన నారసి యుత్తరు
వయ్యాఫీసరులొనర్చి ♦ రాక్టు తెలుఁగునన్. 182

వ. అది యెట్టిదనిన.

భుజంగప్రయాతము. రివిన్యూవిమర్శం బ॰రిష్కార మెల్లా
సివిల్ కోర్టునం దీని ॰ జేయంగ గర్జం
బవుంగాన జూడీశ॰యాలందు దావా
నవశ్యంబు గావింప॰నా వాదికింకన్.

క. తన రెండవదత్తత స
య్యన న్యాయాధికారు॰లారసి మంజూ
రనుదాక వాది పైతృక
మునభాగము గైకొనంగ॰బోలం డరయన్. 184

క. అంతవఱకు సామ్రాజ్యం
బంతయు బ్రతివాదివశము॰నం దుండగ మా
స్వాంతమున నిష్టమొందితి
మెంతయునని యయ్యధీశు ॰ లిడి రుత్తరువుల్. 185

క. ఆ యుభయపక్షములవా
రాయుత్తరు వాలకించి ॰ యపజయవిజయా
కాయతఖేదాహ్లాద
స్ఫాయత్సాగరనిమగ్న॰భావు లయి రొగిన్. 186

ఉ. ఆదట రామనాథనృపు॰డక్కట యోకసుతీర్పునైన దా
రాదృతి నిల్ప కిక్కరణి॰నార్డరొసంగిరి బోర్డువారు ఫి
ర్యాదిది మేముపట్టదగ॰దంచు ప్రభుత్వము వైరిక్రిందనే
పాదుకొనంగ జేసి రిది॰ వైరిపురాకృతపుణ్య మేకదా.

శా. యూరూప్యానులు న్యాయవాదులు సదా॰ యుల్లంబునిష్పక్ష
...త్వాత్ష్మ్యాఢింగధ్రియించు వారు కనయీ॰ వ్యాపార మేలాగున

న్నారాంశంబు నెఱింగి రెవ్విధి బరి♦ష్కారంబు గావించి రీ
తీరై పోవుటకు న్మదీయమగు దు♦ర్దిష్టంబె మూలంబగున్.

ఉ. ఓటమికగ్గె దీనినెటు♦లోరుతు సీవిలులో వివాద మే
ర్పాటొనరింప నెన్నటికి ♦ ఫైసలగున్ మరి గాంగయాత్రకై
గాటపువాంఛ జీమ జను♦కై వడి నా నటువంటిపట్ల నే
నాటికి తీర్పగుం దొరత♦నంబిక నెన్నటి కేను గాంచెదన్.

క. గృహాచారము చాలక దు
స్సహ మీదురవస్థ నాకు ♦ సమకూరిన ది
మ్మహి నైన దీనికి దురా
గ్రహుడు జగన్నాథబాబు ♦ కారణముకదా. 190

క. వచ్చినయిడుముల గుడువక
జెచ్చెరదప్పించుకొనగ ♦ జెల్లదుగా యే
సచ్చరితునకున్ గృహగతి
హెచ్చిన చేట్పాటు నొంద♦రే తొంటినృపుల్. 191

సీ. అలయుధాజిత్తుచే ♦ ననినోడి కాననాం
తరవాసిగాడె సు♦దర్శనుండు
కేశిధ్వజునిధాటి♦కి జలించి వనమున
నెఱి గష్టపడడె ఖాం♦డిక్యరాజు
జ్ఞాతులు తనను రా♦జ్యభ్రష్టుగావింప
నంగదగొనడె చం♦ద్రాంగదుండు
వాలితోబోరాడ♦వసగాక కిష్కింధ
బాసి గాసిల్లడే ♦ భానుజుండు

గీ. దైవగతిదప్పి యొక్కొక్కఁతరి విపత్తు
నంది పిమ్మట సంపదఁ లనుభవించి
రెండరేనియు నక్లేసుఁ నియ్యెడ గడ
గండ్లు బడసియు బిదప సౌఁఖ్యంబుగాంతు. 192

—ఁ రామనాథబాబు ప్రిమిశ్యాల్ కోర్టులోఁ దావా చేయుట ఁ—

చ. అనుచుదలంచి ధైర్యమెదఁనంది పదంపడి యాన్నృనేత క్రి
న్నన తనదత్తర్తఁ రుజువొఁనర్ప నిజాగ్రిజలబ్ధరాజ్యమం
దునసగమ్మఁ దఖల్ గొన నఁనూనధనంబువ్యయంబొనర్చిచే
సె నతినిరంతరోత్కలిక ఁ సీవిలుకోర్టున గంస్లయంటునఁ.

క. సోదరుదావా కగుప్రితి
వాదపుగడువు కలప్రిడ్విఁవాకులయొద్దఁ
మోదమున జగన్నాథ
జ్యాదయితుడు తొంటిమాడ్కిఁ నానస రిడియెన్. 194

క. ఆరామనాథనృపు డెం
దారయ వ్యాజ్యంబొనర్చెఁ నట్టిప్రిమిశ్యా
ల్కోరటువా రాగ్రింథవి
చారణ గావించి రఖిలఁసంపూర్ణముగన్. 195

మ. అలవాదిప్రితివాదులూనిచిన సాఁక్ష్యంబు లసభాపండితో
క్తులు దస్తైవజులు న్వకీళ్లవగు బఁల్తోరంపు హీరింగు లా
త్మలమోచించి సభాధినాయకులు తీఁర్మానించి రకేసు నిం
దలర న్నాగర దసరిదంతిశశిహాఁణాబ్దంబునఁ జూన్
నెలన్.

వ. అది యెట్లనిన.

ఉ. ఒక్కఁడు దత్తుఁడుండ మఱి◆యొక్కనిదత్తత జేసికొంట యే
ఫక్కినిఁదోప దట్లగుట◆ వాదివహించు ద్వితీయదత్తతన్
గ్రక్కున రద్దొనర్చితిమి◆ గావున రాజ్యధురంధరత్వస
మ్యక్కలనం బొసంగితిమి◆ న్యాయవిధిం బ్రతివాదిగారికిన్.

క. అని కోర్టువారు తీర్పిడ
గ నెద జగన్నాథబా బు◆ఖండముదబ్ధిం
బెను నోలలాడె నతిశు
గ్వనధి మునిగి రామనాథ◆బా బుల్లమునన్. 198

చ. ఒకనికి పెక్కుమందిసుతు◆లుండుట యారసులట్ల దత్తపు
త్రకయుగమున్న నేమి యది◆తప్పగునే సుతులెల్ల దండ్రియా
స్తికి వెసగారెకర్త లటు◆సెల్లదె తొల్లి విచిత్రవీర్యపు
త్రకధృతరాష్ట్రపాండులు స్వ◆ధారుణి నిర్వ్వాఱుపంచియేలరే.

ఉ. సీవిలుకోర్టునందయిన◆ జేకురదా జయమంచు నమ్మి దా
వా వెలయించినందులకు◆ వ్యర్థముకాబడె నైననేమి స
త్త్రోవిదపూర్ణమైనపయి◆కోర్టున గ్రిమ్మర వ్యాజ్యము న్మరా
ఘావెసజేసి ప్రాభవవి◆భాగపరిష్కృతి నొందకుందునే.

—* రామనాథబాబు హైకోర్టుకు అప్పీలు చేయుట *—

మ. అనియూహింపుచు జెన్నపట్టణమునం◆దప్పీలు హైకోర్టునన్
దనరించెన్ రహిరామనాథవసుధా◆ధ్యక్షుండు తద్వార్త గ్ర

స్నన నకో్కెరటువారు దెల్పగ జగ•న్నాథక్షమాజాని యిం
పున దోడ్తో బ్రతివాదమూనిచె యథా•పూర్వప్రకా
రంబుగన్.

క. ఈరీతి జగన్నాథ
క్ష్మారమణుకు రామనాథ•జనపతి రాజ్యే
చ్ఛారూఢి సభల నొండొరు
బోరాడ ననేకవర్ష•ములు క్రమియించెన్. 202

ఉ. భూధవతానులబ్ధికయి • బోరొనరించెడు రామనాథగో
త్రాధిపుతో వివాదమన•యంబునయంబునసల్పుచుం జగ
ద్బాధకులం బడల్పుఅచి•వైచుచు నార్యులబో్రచుచుర్ జగ
న్నాథవసుంధరాపతివ•తంసము జేసె నఖండరాజ్యమున్.

సీ. తన రాజశేఖర•త్వము నాత్మయోజిత
ప్రద్యుమ్నవర్ధన•క్రమముదెలుప
తన జిష్ణుశీల మా•త్మకృతనానావిప
క్షబలోగ్రగర్వభం•జనమె దెలుప
తన కళాకరత నా•త్మకృతగురుబుధ
కవిగతాయతసుఖ•గతియె దెలుప
తన మహాభూదార•త గృతోరురుచ్యభ
క్తహిరణ్యనేత్రప్ర•దయత దెలుప

గీ. సహ్యజోభయతట•సర్వసర్వంసహా
తలముపాలనంబు • సలిపె నిజభు

జాగ్రజాగ్రదతిమ◆హాసాంద్రగతి జగ
న్నాథబాబునృపతి ◆ నతరిపుతతి. 204

సీ. తన యశోనటిని కెం◆తయు జక్రవాళాద్రి
కూటముల్ తాండవ◆కూటములుగ
దన రూపజాలపా◆దమునకు వనితాంత
రంగముల్ ఖసరిత్త◆రంగములుగ
దన దానమాధ్వీక◆ధారల కఖిలార్థి
పాళి నూద్యన్మధు◆పాళి గాగ
దన భవ్యగుణమణి◆తతికి సత్కవిదత్త
కృతులు విభూషణా◆కృతులు గాగ

గీ. దనహృదుల్లసల్లి◆త మహేశ్వరపదప్ర
వాళములకు నాల◆వాలముగ ధ
రిత్రినేలె వాసి◆రెడ్డి జగన్నాథ
బాబునృపతి లబ్ధ◆భవ్యనియతి. 205

సీ. ఇచ్చినా డఖిలమ◆హీసురావళికి మా
న్యములు గండ్రిక లగ్ర◆హారములును
దెచ్చినా డన్వయ◆స్థితికి జెన్నగు వన్నె
భూరిసద్గుణవార◆ధారణమున
విచ్చినా డతిధర్మ◆విభుత భూజనపర
స్పరకల్పితవివాద◆బంధములను
హెచ్చినా డాత్మస◆దృగ్భూమిధుర్యవ
ర్యులకంటె సంతతా◆భ్యుదయగరిమ

గీ. సకలవారిదిందుసుందరా♦స్యాకదంబ
వృత్తవృక్షోజమండలా♦వృతవిలసద
పారహారపరంపరా♦భావభాగ్య
శోభిభుండు జగన్నాథ♦భూవిభుండు. 206

—* జగన్నాథబాబు స్వర్గస్థుడగుట *—

క. ఈరీతిం బాగ్రభవ మే
పారగమహి నేలి యాత♦డంత తదీయ
శ్రీరూఢికి మది దనియక
స్వారాజ్యం బాక్రమింప♦జనిన తెఱగునన్. 207

క. పదునెనిమిదివందల నరు
వదియైదవసూర్యాణశకపు♦వత్సరమున దా
ద్రిదివమున కరిగె జనసౌ
ఖ్యదుడు జగన్నాథబాబు♦గా రిల దలకన్. 208

క. ఆయన చనువఱ కొక పై
సాయైనం బాకిపడక ♦ సర్కారున కా
త్మీయమగు శిస్తు సెల్లిన
ఘాయెంతయు గలిగి రాజ్య♦పద ముండుటయున్. 209

ఉ. ఆయెడ వేంకటాద్రివసు♦ధాధిపు రెండవ దత్తపుత్రుఁ డా
త్మీయమనఃకుతూహలము♦ దీర్చుకొనం దరిసంఘటిల్లె నా
హా యని రామనాథనృపు♦డగ్రజపాలితరాష్ట్ర మాత్మవం
శీయమునాక్రమించుకొని♦ సేయదొడంగె మహాప్రభుత్వమున్.

శా. భానిస్తుల్యవిలోకలోకహననా◆పాదీభశార్దూల ర
క్షోనిర్భేదనదక్ష దక్షతనయా◆శుంభన్మనఃపంజర
స్థానాటచ్ఛుకరాజ రాజతకుభృ◆త్సంవాస వాసవ్యభీ
ష్టానూనంబకదాన దానవవిరో◆ధ్యస్త్రోద్ధపూరాశరా.

క. ఘోరాఘగిరిశతారా
తారాపత్యహివరత్రి◆దశకాసారా
సారభ్రాజదగారా
గారళసంతాపహృతి జ◆గత్ప్రీతికరా. 212

పంచచామరము. పరాశరప్రధానయోగి◆భవ్యచిత్తగోచరా
చరాచరప్రపూర్ణకాండ◆ఝాటకుంభితోదరా
ధరారిభృద్విరించనస్తు◆తప్రచారభాసురా
సురాభియాతిభీకరత్రి◆శూలవిస్ఫురత్కరా.

క. భాసిలు నీకృతి ప్రథమా
శ్వాసంబిదియాచు నమర◆వాదిభవాన్యం
బాసోమేశ్వరదీక్షిత
వాసవసుతరామయకవి◆వరరచితంబై. 214

ఇది ప్రథమాశ్వాసము.



# వాసిరెడ్డీయము

## ద్వితీయాశ్వాసము


వాసిరెడ్డి నరసిం
హావనిపతివిమలమాన♦సాంతరవర్తి
దేవస్తుతకీర్తి పరి
భావితసమవర్తిరుచిర♦పాండురమూర్తి.

—♦ రామనాథబాబు రాజ్యమును బలవంతముగా ఆక్రమించుకొనుట ♦—

తే. అవధరింపుదేవ ♦ యటుమీఁదటి కథాక్ర
మంబు రామనాథ♦మహీపుఁ డట్లు
నాత్మహితులు మెచ్చ♦నగ్రజాచరితరా
జ్యంబునెల్ల గడిమి ♦ నాక్రమించి. 2

మ. స్వజనోల్లాసముగానతండు పదిమా♦సంబుల్ ప్రభుత్వంబుజే
య జగన్నాథనృపాలుభార్యలగు నా♦యచ్చమ్మరంగమ్మ త
త్ప్రిజలమ్మేటికృతాధికారమున కీ♦ర్ష్యాగ్రస్తులైయుండిరం
దజితోత్కంఠిత రోషితాత్మయగుచ♦య్యచ్చమ్మగారిచ్చలోన్.

ఉ. న్యాయసభాధికారులు ని♦జాంశముతీర్పిడుగాక రాష్ట్రిమాం
గ్లేయులు మన్మనోరమణు♦క్రింద\'న జేర్చిరికాదె మన్మనో
నాయకునగ్రపత్నియగు ♦ నాయది ప్రాభవ మన్మదాత్మనా
ధీయము నెట్లు నీయనకు ♦ దీసికొన న్విధిచోదితంబగున్.

ఉ. ఈయననాగి రాజ్యముగ్ర♦హింతమటన్న నతండుపూరుషుం
డాయతశౌర్య డే నబల♦నట్లగుటం దగువారినందరిం
దాయవశంబొనర్చుకొని ♦ నాయధికారము దొమ్మిజెల్ల నీ
డేయెడ మత్ప్రతీభ్యత వ♦హింపగనాకు నుపాయమెద్దియో.

మ. అనిచింతించెడుచో దదీయులగువా♦రద్దేవిచేతఃప్రవ
ర్తనమూహించి ఫలించెబోమనవిచా♦రంబంచు నారాణితో
జనయిత్రీ మనరాజుగా రెనయు రా♦జ్యంబూనగా నెవ్వడీ
యన ధార్త్యంబున నాక్రమింప మనకు♦న్హార్షింపగా జెల్లునే.

మ. అనిహావ్యోజ్జ్వలితానలంబున బ్రవ♦ర్ధ్యంజల్లు చందంబునన్
మునుపే తద్విజిగీషణుండు సతి కి♦ప్పోల్కిం దదీయుల్వెసం
బెనుబోధింప దదుద్యమోత్కలికయై♦భృత్యాప్తముఖ్యాప్తినా
య్యసన ద్దేవిరిపూచ్ఛమాన్పనగు కా♦ర్యంబెద్ది తెల్పుండనన్.

మ. త్రివిధోపాయముల న్విసాధ్యుడతడు♦ర్వ్యజానిసాధ్యుండునా
ల్గవయత్నంబున నట్టివాడగుటవే♦గన్న్యాయసమార్పిట్సుభర్
వ్యవహారంబమరించి తీర్పువలుకు ♦ న్సర్కారు జప్తీని నీ
భువిజేర్పించిపరిభుత్వమాయన దఖల్♦పోజేయగర్జంబగున్.

—♦ అచ్చమాంబగారు రాజ్యమును కోర్టు ఆఫ్ వార్డ్సు పరము చేయించుట ♦—

మ. అనికర్తవ్యమునిశ్చయింపగ బ్రమి♦శ్యాలోకోర్టునందచ్చమాం
గనవ్యాజ్యంబు వకీళ్లమూలముగ దా♦ఖల్జేసె మద్భర్తవో
యినచో నివ్విధిరామనాథహృతమ♦య్యె నాప్రజ్య మేనగప్ర
త్నిని మద్భర్తకు దత్కృతప్రభుతకు♦న్నే వారసున్నాగతిన్.

ఉ. సంతతమివ్వివాదము వి♦చారణదారిచి తీర్పొసంగుప
ర్యంతము మద్విరోధిహృత♦రాజ్యమనామతు సేయుడంచునే
కాంతజిగీష జప్తుదర♦ఖాస్తిడ దీర్పగుదాక రాష్ట్రమ
శ్రాంతము కోర్టువారు తమ♦జప్తుననుండ విధించిరార్డరున్.

చ. కరకరి నచ్చమాంబదర♦ఖాస్తున నాసరికుర్యాటు కోర్టువా
రురువడి వాసిరెడ్డిదగు♦ నుర్వరసర్వము జప్తుజేసి క్రి
చ్చర దమ పేరవ్రాసిన ప్ర♦శక్తున గల్కటరు ల్కరం బమల్
జరుప దదుర్వరం దమవ♦శంబున నుంచిరి బిట్టుఘారిటెన్.

మ. ప్రతివాదానకు వచ్చినట్టి సమర్థ♦రాష్ట్రంబుజప్తౌటయుం
బ్రతివాదిక్షితినాథుడారసి విధి♦ప్రాప్తిజ్ఞగన్నాథుతో
బ్రతిరోధం బరెనంచు మద్విభుతనా♦రంభించియున్నంత దు
ర్మితమై నచ్చమవెంటనంటెగద బ్రా♦రబ్ధంబు సైతానియై.

క. మానుషము వదలి మా సం
స్థానమునకు నప్రతిష్ఠ ♦ సమకూర్పగ నీ
చాన తనపేరు కోర్టుల
లో నెరిగించెగద సదృశ♦లోకము నవ్వన్. 13

క. తగ వింతితో ఘటిల్లిన
మగువ న్బయలెక్కనీక • మలిపినవాడే
మగవాడి త్తఱినాచే
నగువలకినాతి వాద•మణపుకొనదగున్. 14

—* రామనాథబాబుగారు అచ్చమాంబగారితో రాణీకి ప్రియపఱచుట *—

మ అనియూహించి వకీలునొక్కరుని సం•ధ్యాసక్తి రావించి నె
ట్టన నీ వచ్చమగారిచెంగటికి వే•డ్కంబోయి దేవీ భవ
త్తనయప్రాయుడునీమఱంది ప్రియ మొం•దన్రామనాథేభ్యుడం
పినసేవచ్చితి నానృపాలుడు భవ•త్ప్రీతింగడుంజేసెడిన్. 15

మ. ధనమెంతేనియు లౌణసీగలడు నీ• తాత్పర్య మట్లొప్పకుం
డిన నీకోరినయూళ్లు నైదుపదియు • న్నీజీవనోపాధికిం
దనరింపంగల డింకనీయనుమతిం • దారాజ్యముంజేయువా
డను మోదించియకీర్తి కారణపువ్యా•జ్యంబార్పగాగోరెడిన్.

మ.అనివాక్రుచ్చుచుటంచుబంచిననతం•డ య్యచ్చమాంబాంతికం
బునకునొబ్బయి నిజేశువాచికమునా•మోదంబుతో జెప్పగా
వినుచున్నంతదదీయ తాంతికజను•ల్వీక్షించి యట్లాయమం
గనుసైగంబురికొల్ప నింతియు దదు•క్తశ్రీకిగాంక్షింపమిన్.

క. ఆరాణి సి•జోక్తంబగు
నారాజీకిష్టపడమి • నరసి తన్మిథో
వైరికరులైనపారల
దూరుచు నారాయభారి • దొరసాని ననున్. 18

ఉ. క్ష్మాధవవర్ణనీయగుణ♦సన్మణివార్నిధి వేంకటాద్రిభూ
నాథవరోత్తమస్నుష వ ♦ నంతయశఃపరిపూర్ణదిగ్గజ
న్నాథనృపాలపత్నివి స♦తంబవరోధనధూటివీవు ప్రా
ణాధిపగోష్ఠులందు భవ♦దాహ్వయముం బ్రకటింప బాడియే.

చ. అనవినియాగ్రహించి వెస♦నచ్చమభృత్యులు రాయభారితో
నని రహహా హితోక్తి దెగ♦నాడితి వాత్మధనంబు నన్యుడుం
దిననదిక్రమ్మఱంగొనుట ♦ నేరమె దత్క్రియనాచరింప మా
జననిసమాఖ్యహాణసభ ♦ జాటిన దీన బ్రతిష్ఠ నష్టమే. 20

గీ. ఆత్మదత్తతయ నిషిద్ధ ♦ మయ్యె నిట్టి
తా బరార్థంబు హరియింప♦దలచి లవన
సూళ్లసంగెద రాజీకి ♦ నోడబడుమన
నెవ్వరీయన న్యాయమ ♦ కేడ మఱది. 21

చ. హితుడవపోలె మాజనని ♦ కెగ్గొనరింవగ నున్నవాడ వీ
గతిగపటోక్తి హృద్యకల♦కల్పనము ల్ఘటియింపనేల మీ
పతికృతసంధిరీతులు ల♦వంబును మాజనయిత్రికింపు గా
వతిధృతి నిట్లుపల్కితి మ♦టంచు భవత్పతితో ననందగున్.

క. అనుచు దదీయులు బదరిన
విని వినవిధాననుండి ♦ వెలదిమనోవ
ర్తనము బయలెక్క వేడిన
వనితయు దనవారలనిన♦వరుసన పలికెన్. 23

చ. అనవుడు రాయభారి కన ♦ లందుచువచ్చి తదాగ్రహప్రవ
ర్తనములు రామనాథవసు♦ధాపతికిన్వినుపింప నాడపె

త్తనమదిగాక యెట్లయిన • దారుణవైరము బెంచి జీవనం
బెనయుజనంబుమంత్రిమున• కేర్పడనక్కటసంధియెట్లగున్.

చ. పురుషుడు పూరుషుండుసభ•బోరొనరించుట లెస్సకాంతతో
బురుషుడు బోరొనర్పనది • బూరుషవర్యున కప్రతిష్ఠ నా
తరమగు శే డడంగుట స•దాసతితో ననిక ల్గెనేటికిఁ
వెరవబురాకృతంబనుభ•వింపక చెల్లునె యెంతవానికిన్. 25

క. పురుషుండ హక్కుదారుడ
నెరి న న్నే కోర్టువారు నిరసించి తలో
దరికీయమ కెవ్విధమున
ధరణికి బట్టంబుగట్టె•దరొచూడవలెన్. 26

క. అనినిశ్చయించి నెమ్మది
జనపాలుఁడుండినంత • స్వప్రతివాదం
బునకుఁ న్యాయాధిపతుల్
దనరారిచినట్టివాయి•దా గదియుటయున్. 27

చ. పురుషుడనౌట కర్తను బ్రి•భూతమదగ్రిజపాలితక్షమా
భరణమొనర్ప నిట్టె నను • బాపి వితంతువు రాజ్యమున్గొన
న్వరుసయె యన్న భార్య మఱి • నావలనన్భరణీయురాలటం
చరయ నకీళ్లమూలముగ • నానసరాతడొసంగె గోర్టునన్.

క. అతడానసరిడ సారాం
శతతుల్యటియిల్లె నుభయ•సంవాదగుణ
స్థితులు రుజువిడగవాది
ప్రతివాదులు డిఫెనసులను • బలపఱచుటయున్. 29

—* ప్రివిశ్యాల్ కోర్టువారు రాజ్యమును అచ్చమాంబగారి పక్షము చేయుట *—

మ. సతికావించిన కంప్లయింటు నృపతం♦సంబిచ్చ్చుకై ఫీయతా
తతవాదిద్వయి తార్పుసాక్షి గరిమల్♦దస్తైవజుల్పండితా
ర్పితసంప్రశ్నలు ప్లీడరుల్సలుపుహీ♦రింగుల్వ్యిమర్శించి స
మ్మతిజడ్జీలతిసావధానమతి దీ♦ర్మానించిరావ్యాజ్యెమున్.

చ. ధరబ్రితివాదిగారు తన♦దత్తతయీయావలకే సభేశుచే
స్థిరబరిపించుకోబడమి♦చేదగడీభృతబూనగా నిజే
శ్వరకృతరాజ్యధుర్యత క♦వశ్యము కర్త్రిణియచ్చమాంబలా
వరిప్రతివాదివాదికగు♦వ్యాజ్యెపుఖర్చులు మొత్తనీయదగుర్.

మహాస్రగ్ధర:—
అనుచుందీర్మానముంజేయంబడిరలప్రమి♦శ్యాలుకోర్టునందుజడ్జీల్
తనరం బార్టీలు తద్వార్తను విని మది మో♦దంబునిర్మోదముంగై
కొనసయ్యెనాప్రినాథేట్కులజులకట యీ♦కోర్టువారక్రమంబు
న్వనితాపక్షాత్మకులై కేవలమనిపనుచుర్ ♦ వ్యాకులుం డౌచు
నాత్మన్.

క. వీరిట్లు తీర్పిడం బయి
వారయినందీని కోజు ♦ బరికింపరొకో
నారికి నే నోడినచో
నారయనాకింతకంటె ♦ హైన్యముకల దే. 33

మ. ఇదియప్పీలున ద్రిప్పికొందుగద రే♦ పీవేళకున్నాయభీ
ష్టదుడ యొ్యాకసుబోర్డుమెంబరయిగా♦థపీ్రతితోనున్న వా

డడె మదార్సిసున నింకముందునెల నే • హైకోర్టుజడ్జీని న
య్యెదనంచు న్వెస వ్రాసెను త్తరమునా • కిళ్లేలమేల్సేకుర్న్.

మ. అయినం గార్యముపట్ల నాకు దనచే • నైనంత సాహాయ్యమె
మ్మెయినైన న్ఘటియింపబల్కె నిడియా • త్మీయంబుగాకున్న నెం
తయు గార్యంబొనరించు చోనతడుమ • ద్రాసందెయున్నాడుగా
భయమేమం చలకిందితీర్పరము రా • ఘాచేయ నుత్సాహియై.

—* రామనాథబాబుగారు హైకోర్టు కప్పీలుజేయుట *—

క. ఆజడ్జిమెంటునక
ళ్లోజంగైకొని తదుక్తి • నుడుపగ నప్పీ
ల్యోజించె సదరు కోర్టున
భూజాని వకీళ్లమూల • ముగ జెన్నపురిన్. 36

ఉ. చాల విధిజ్ఞులై నయము • నల్పిరి బందరుకోర్టువారు నా
కోలిమి నంచు నచ్చమ మ • హోన్నతినుండగ రామనాథభూ
పాలకు డక్రమ బనుచు • బైసభవారి కొనర్చినట్టియ
ప్పీలున వాయిదాసమను • వేగమె రాబడె నచ్చమాంబకున్.

మ. నమ నేతెంచినతోన భగ్గురని యా • సభ్యాస్థలింగెల్చె న
య్యమితాస్థానమునందుగాని గెలువం • డాహాయితండంచున
చ్చమగా చెర్పడు వాయిదాసరికి డా • యందావకా త్తీల ను
త్తములంబంపి పురావిధిన్డిఫెనసుం • దార్పించె హైకోర్టునన్.

క. ఆలీల రామనాథన్పృ
పాలకు డచ్చమ్మగారు • వదలక యాత్మీ
5

యాలఘుసామ్రాజ్యమునకు
నోలి వివాదంబు సలుపు♦చుండిన నచ్చోన్. 39

—♦ అచ్చమాంబగారిసవలియగు రంగమాంబగారిప్రయత్నము ♦—

మ. అకటా నాకు ననుంగుపుత్రుఁడు మదీ♦శాంగీకృతుండుండ వీ
రికి నెట్లీభృత్య నొందనౌననుచు బే♦ర్మిఁ రామనాథాచ్చమా
త్మకృతానోన్యవివాదచర్యకు జగ♦న్నాథక్షమాజానినా
యకి రంగమ్మ నిజాంతరంగమున నీ♦ర్ష్యామర్షసంకర్షయై.

సీ. ప్రాణేశ్వరున కగ్ర♦పత్ని దా ననుచు నా
స్థానమం దచ్చమ్మ ♦ జాటుకొనెనె
నిగువురసతులభూ♦వరు డొకచో గర
గ్రహణంబొనర్చె ని♦క్కరణి మఱుగు
పఱచి పరార్థాశ♦బరమాన్యతంబు వా
డించినమాత్రాన ♦ దీన నేమి
యగునదిగాక ము♦న్నాత్మవల్లభువల్ల
మనవర్తిలవనను ♦ గొనియె నరయ
గీ. నిట్టిదైయుండె దనవిధం ♦ బీబిడకు బ్రి
భుత్వమెట్లగు దనయత్న♦ము ఫలియింప
నీయుటకు నంతవెంగలి♦నే క్రమాన
దండ్రిసొత్తుకు సుతుడు క♦ర్తయగుగాదె. 41

క. అని యచ్చమాంబవిషయం
బున దలచి కుటుంబభరణ♦ముఖ్యుడ నని వా

దనమాడు రామనాథా
వనిపతివాదము దలంచి ♦ పరమాద్భుతమై. 42

క. నాథుడు గతించినంతనె
సాధింపదలంచినాడు ♦ సామ్రాజ్యము మా
భూధవునకు దనకుఁ ద
ర్వాధిపసభ జరుగువాద ♦ మది మానెన్గో. 43

సీ. ఒకరి కీర్వురుద త్తు ♦ లుండుటకలదె యీ
చిన బాబుద త్తత ♦ సెల్ల దుర్వి
జెల్లనీ జ్యేష్ఠత ♦ చేజూడ నారాజ
ఘ తుర్రిండె కర్త ప్ర ♦ భుత్వమునకు
తగవుమాలిన వివా ♦ దం బీయన ఘటింప
నోరునట్లు గనుచు నే ♦ నుండదగునె
యిదివఱ కే తప్పి ♦ నిపుడైన బయలెక్క
కున్న దర్వాత జే ♦ యునది యేమి
గీ. వరుస నస్మదాత్మ ♦ వల్లభాంగీకృతుం
డయిన నాయనుంగు ♦ సర్భకున క
శేషభూమి దఖలు ♦ జేయింప కిట్లుండ
రాదు నా కటంచు ♦ రంగమాంబ. 44

చ. తనమది దల్బుచో సతిప్ర ♦ ధానవిధేయులు దేవి కాత్మగో
ల్కొను మననం బెరింగి పురి ♦ క్రొల్పగక్రొల్పగ నేటికింగడా
మనదొరసానిచి త్తము క్రి ♦ మంబున శత్రుజిగీషనొందె జ
య్యానఫలియించెబోమనప్ర ♦ యత్నమటంచెద బొంగునాయమన్

చ. భవదధిపాత్తరాజ్యము భ♦వత్ప్రతిపిమ్మట సీసుతుండు న్యా
యవిధి వహింప వారసిపు ♦ డా యున నైనరు గాన నీవ య
ర్హావు తనయార్థ మీభృతను ♦ హత్తగనట్టిక్రియంబుదల్పకీ
భువిచినబాబు నచ్చమయు♦ బూనగ నొండొరుబోరకర్తలే.

క. వారట్లిర్వురు బోరెడు
చోరహి బెరవారిమాడ్కి ♦ జూచుచునుండ
న్గారణ మేమి ప్రభుత్వం
బారడిపుచ్చంగ మనకు ♦ నర్హాంబగునే. 47

మ. అనిబోధించినదత్ప్రబోధమునిజా♦త్మాంకూరితోరూహ గ్ర
ద్దన దారాకాణపడంగ సంతసిలి క♦ర్తవ్యంబు యోచింపు డీ
రన సద్వ్యవహార మెందడఁగు నా♦యాస్థానమందే పిటీ
షనుబెట్టం జనునన్న రంగమనిజాం♦చన్మంత్రిముూలంబుగన్.

క. పోరాటం బయ్యచ్చమ
గారికి నలచిన్నబాబు♦గారికి నపుడే
కోరటున జరుగు నాహై
కోరటున బిటీషనొకటి ♦ గుజరాయించెన్. 49

ఉ. నాయజమానిగా రనుగు♦నందను దత్తుని నా కొనర్చినా
రీయుభయప్రివాదులకు ♦ నీభృతకర్హతలే దశేషము
న్న్యాయవిధి న్మదర్భకుని♦దంచు బిటీషను బెట్టగానధో
న్యాయసభాజ్ఞ వివాదమిడ♦నాయము కార్డరొసంగ రాదొరల్.

—♦ ప్రిమిశ్యాలో కోర్టులో రంగమాంబగారు దావాదాఖలుచేయుట ♦—

శా. హైకోర్టార్డరుపట్టి రంగమప్రిమి♦శ్యాలోకోర్టునం బ్రాభవ
శ్రీకచ్చపమ్మయు రానునాథపతి లా♦చే నెన్న బేవారసుల్
నాకస్మద్గ్రిమణోరితుండగుచు ను♦న్నాడర్భకుం డాక్టుచే
నాకాంతా చరితప్రిభుత్వమునకు♦న్నా సూను డర్హుండగున్.

చ. అనువుగ నాయెనర్ప్రురుజు♦ వారసి మత్ప్రితివాదయుగ్మకం
బునకుబ్రిభుత్వక ర్తృవిధి♦బోనిడి మత్సుతుహక్కు నిర్ణయం
బొనరిచి మన్మనోహరధృ♦తోర్వికి మైనరు గ ర్తజేయు డీ
రనుచు వకీళ్లమూలముగ♦ వ్యాజ్యము దాఖలుజేసె నంతటన్.

క. కోరటువా రది ఫైలున
దారిచి యీవ్యాజ్యమునకు ♦ దగునుత్తరముం
గూరుప దమ కోకటయ నిడి
జారీచేసిన సమనులు ♦ చనుదెంచుటయున్. 53

క. సాపత్న్యపుమాత్సర్యము
జూపెగదా రంగమాంబ ♦ సుతుబ్రోది సయో
భూపతి నే నుండగ దన
కేపగిదిఁ సంఘటించె ♦ నిదినిక్కమొకో. 54

గీ. పాలుఁనీరు నేరు♦పఱచుమరాళంబు
కరణి నిజము కల్ల ♦ నరయజాలి
యెంత చిక్కులేని ♦ నెఱుగుజడ్జీ లహో
దీనిలోని కోజు ♦ దెలియలేరె. 55

చ. అనితలపోసి చిత్తమున ♦ నచ్చుమగారల రామనాథబా
బనయ మొకర్తుతోడనె ప్రి♦యాసము నొందెదుచో
ద్వితీయయుఙ్
బనుబడ వెంటనంటెగద♦ప్రాక్ప్రతిబంధములౌచునిర్వ్యరం
గనలమ లడ్డగించి రిరు♦గాళ్ల బెనంగిన శృంఖలాకృతిన్.

ఉ. వాలి గతించిసంత నల ♦ వానరరాష్ట్రము భానునందనుం
డేలడె రావణుండు గతి♦యింప విభీషణు డల్లసింహళం
బేలడె యిట్టి వెంచుట క♦ధీశ్వరు లన్యమతస్థులైరి హిం
దూలపురాణగాధ లెద♦దోచునె చెప్పిన విశ్వసింతురే.

క. ఎక్కడిద త్తకుమారకు
నెక్కడ బెదబాబు దనను♦నెనయించె నహో
యిక్కరణి నుండె రంగగ
చక్కట్లది నిజము కల్ల ♦ జగ మెఱుగదొకో. 58

ఉ. ఎంతటిగొప్పపన్నుగడ ♦ యెంతటిమొత్తిది యెంతకార్యమ
క్కాంత బిరాదరింగలుగు ♦ కార్యవిధిజ్ఞులలోన నిట్టిదు
ర్దాంతవివాదమూనుచు ప♦రాక్రమకోవిదుడెవ్వ డిట్టిధీ
మంతుప్రయోజకత్వమది♦మచ్చరమచ్చెరు విచ్చనిచ్చెడిన్.

చ. కృతకసువర్ణరాశిక్రియ♦కృత్రిమరత్నచయంబుమాడ్కిఁగ
ల్పితఫుచలామణీలగతి ♦ బెంపగుగారడిచర్యలాగగుఙ్
జతురత రంగమాఖ్యసతి♦సల్పువివాదము దీనిసూనృతా
నృతములుప్రాడ్వివాకులగు♦నేతృలకుం దెలియున్విచారణన్.

చ. అయిన ప్రభంజనుండు జల♦దావళి, హేళి హిమంబు,జంద్రు డ
వ్యయతమ, మద్దవాగ్ని నిబి♦డాటవికై వడి మద్విరోధి దు
ర్నయకృతదుర్వివాదమును ♦ న్యాయసభాశ్రవణీయవాదినై
హాయలజయింతునంచు నత♦దుండగనాన్సరు వేళరాబడెన్.

—♦ రామనాథబాబు, అచ్చమ్మగార్ల అన్సర్లు ♦—

క. ప్రతివాదపుమితినాటికి
బ్రతివాదులు రామనాథ♦బా బచ్చమయుం
బ్రతివాదము నడపిరి తా
రతిరతి బ్రత్యేకరీతి♦నది యెట్లనినన్. 62

క. మన్నెసులతానుగారు జ
గన్నాథప్రభుండునన్ను ♦ గైకొనియెశ్శా
స్త్రోన్నతి బుత్రస్వీకృతి
నన్నసనుట వారసుం గు♦లాధ్యక్షతకున్. 63

చ. తనకు నిజేశుడొక్కరుని♦ద త్తతగూర్చెనటంచు రంగమాం
గనఘటియించువాద మది ♦ కల్ల మదగ్రజునంతమందు ద
ధ్ఘనకృత రాజ్యధుర్యతకు ♦ గ ర్తనక ర్తలనాథ లుర్విపా
లనకని రామనాథనృల♦లామకు డానన యూరిచెసభన్.64

చ. ఇరువురిలో ధవాగ్రసతి ♦ నేనయియుండగ ద త్తపుత్రునే
హరువునగూర్చెభ ర్తదన ♦ కక్కట రంగమవాదనం బస
త్యరచన రామనాథనృపు♦ద త్తతశాస్త్రనిషిద్ధ మస్మదీ
శ్వరవిభుతా ప్తికీ యుభయ♦వాదులు లావిధి గారువారసుల్.

క. నావిభునకు నేబట్టపు
దేవిగ మద్భర్తృరాజ్య♦ధృతి కేనర్హన్
నావాదము మంజూరన
నా విధి నని యచ్చమాంబ ♦ యూనసరిడిమెన్. 66

చ. ఇరువుర మొక్కెడగ ధవగృ♦హీతలమైతిమి భర్తకగ్రసుం
దరిననియచ్చమాంబ సభ ♦ తార్చినవాదముకల్ల నాయెడగ
దరుచుగ కూర్మియున్నకత♦న న్సుతునాకొనరించినాడు మ
ద్వరు డలరామనాథనృపు♦ద త్తతశాస్త్రనిషేధమారయన్.

మ. ఉరుమద్వంశవహుండు వీడనుచుదా ♦ నూరీకృతుంజేసె మ
ద్వరుడస్మత్పరివర్ధితార్భకు యథా♦ర్థం బేతదృగ్వార్తపై
మరిమద్వైరులొనర్చు వాదములు బే♦మంజూరులిష్టేటుమై
నరుగార్డియనుగాన నాదియనుచుగ ♦ రంగమ్మ రిప్లై నిడెన్.

ఉ. అచ్చమపార్థివాగ్రసతి ♦ యైనదికానిది ద త్త తాంశమం
దచ్చినబాబు శాస్త్రహితు♦డై నదికానిది రంగమాంబ కిం
పెచ్చ ధవుండు ద త్తసుతు ♦ నిచ్చిన దీయని దవ్వివాదమం
దిచ్చదిరివాదకుల్ రుజువు ♦ నీసభ నేర్పడిమెన్ స్థిరాంశముల్.

క. ఆపాయంటుల నన్నిటి
నాపార్టీల్ ముగురు రుజువు ♦ నాత్మీయప్రా
థోపాయంబులకొలదిగ
నాపాదింపబడి గ్రంథ ♦ మది ముగియుటయున్. 70

శా. ఆపాదించిన కంప్లయంటు నటుపై ♦ నాన్సర్లు దస్తైవజుల్
శ్రీపూర్తింబలికించు సాక్ష్యములు హీ♦రింగుల్ సభాపండిత

వ్యాపార్యర్పితశాస్త్రసమ్మతవచో♦వ్యాప్తుల్విచారించి ప్రి
జ్ఞాపూర్ణస్మృతి కేసుదీర్చిరి ప్రివి♦శ్యాలోకోర్టువా రెల్లసన్.

—♦ ప్రివిశ్యాలోకోర్టువారితీర్పు ♦—

ఉ. తద్దయు రామనాథనృపు♦దత్తత శాస్త్రనిషిద్ధమాటచే
రద్దొనరించినారమది ♦ రంగమవాదము నమ్మరామిచే
గ్రద్దనగొట్టివేసితిమి♦రాట్పృథమాంగన యచ్చమాంబయే
తద్దృఢసూక్తినమ్మనయి♦తార్చితిమచ్చమకుంబ్రభుత్వమున్.

మ. అని తీర్పున్వినిపింపగా విని కరం ♦ బచ్చమ్మహర్షించె న
చ్చినబాబుప్రభురంగమాంబలు కడుం♦జింతించి దోడ్తోనస
ళ్ళనకళ్ళంగొని తన్మిథోజయమతుల్ ♦ హైకోర్టునంజేసి రో
ప్పనియాతీరుపుమార్పవైవగ ముదా♦ఫాలిర్వ రత్యుగ్రతన్.

—♦ ప్రివిశ్యాలోకోర్టుతీర్పుపై అప్పీలు ♦—

క. అప్పీలుకోర్టువా ర
య్యప్పీళ్లకు సమను లనుప ♦ నచ్చమ తా న
య్యప్పీళ్లగడువునాటికి
దప్పక నడిపెం బురావి♦ధమునబురావాళ్. 74

మ. కనదగ్రేట్సభనిట్లు మువ్వు రుపరి♦గ్రంథంబు యోజింపగా
మును నచ్చమ్మకు జిన్నబాబు కచటం♦బొల్పారునప్పీల్రికా
ర్డును రంగమ్మనహాత్రివాదులకుతో♦డ్తోనా మురాఫామిసల్
గని తద్గ్రంథమునెల్ల గేసునొకటిం♦గావించి రద్ధర్మపుల్.

మ. అలవాదిత్రయ మమ్మహాసభనమే♦యార్థవ్యయంబూని మే
ల్వైలయర్ లాయరుల న్వకీళ్ల మరి బా♦రీస్టర్ల గూర్పించి జా
బ్బిల హీరింగులు వాయిదాలసరికి♦న్వేమారు జేయింప దో
హాలులైవించురికార్డునారయుచుస♦భ్యాధీట్రయంబుండుకున్.

ఉ. చేనయినంత నెచ్చెలికి ♦ సేమమొనర్పనివాడు ప్రాజ్ఞుడే
నా నెరమిత్రుడైన నర♦నాథునికార్యము నిర్వహింపనా
కౌనని రామనాథహితు ♦ డమ్మదరాసున బోర్డుమెంబరై
క్ష్మానిఖిలంబునేలెడు జ♦గాదొరగారగు నోక సమ్యేడన్.

—♦ ఓకసుగారు హైకోర్టుజడ్జీలకు సిఫారసుచెప్పుట ♦—

మ. చనువొప్పార వయాళికేగి తమి నా♦జడ్జీల దా నట్టిచో
గని యన్యోన్యసుహృద్భహూకరణస♦త్కారంబులైనంత గ్ర
ద్దన నానావ్యవహారరీతుల జమీం♦దార్లం బ్రశంసించి వే
తనతో వారలు వాసిరెడ్డికథ నె♦త్తంజేసి దానిట్లనున్.

మ. ధృతిగుంటూరుకలెక్టరిన్నలుపు చా♦దిన్వాసిరెడ్డిద్వయ
స్థితిసర్వంబు విమర్శ సేయబడితీ ♦ శ్రీరామనాథేభ్యుద
త్తత తథ్యం బలజ్యేష్ఠుడుండుట బ్రభు♦త్వంబబ్బదయ్యె న్విల
క్షితుడాతండిపుడన్వయప్రభుడగుర్♦జ్యేష్ఠుండునష్టించుటన్.

ఉ. సూనులు నిర్వరంచు దన♦సొత్తుకు గర్తలటంచు మన్నెసు
ల్తా నుయలేర్పరించె దన ♦ దైహికదార్ఢ్యము తప్పువేళ నో
భానుసమానులార దయ ♦ వారిరికార్డున జిత్తగింపగా
నా నదిమీకటంచు నత ♦ డాదృతిబల్కిన నవ్వి యద్దొరల్.

చ. మనమున రామనాథునెడ♦మక్కువగల్గినయట్లు దోచుమా
కన నధికారమీవు వెస♦గాంచిన నాతనిబోత్రువన్న న
న్ననబనియేమి మీరయిన♦న్యాయముకల్గినబోవకుందు రే
యని సరసోక్తిదేలిచి త♦దాప్తులచే సెలవొంది తా జనెన్.

మ. మఱిజడ్జీల్ హితుడోకసాబసున సం♦భాషించు నాలాప మా
దరణీయంబగు నైనవ్యాజ్యమిది ని♦ద్దాపెద్దయెస్టేటుతో
బరికీర్ణించినదాట నింకనరయం ♦ బాగంచు బల్మారు వా
విరి హీరింగులు వాయిదాలసరికి ♦ న్వెంచుండి రంచన్మతిన్.

ఉ. అచ్చమరంగమాంబనల ♦ నాగి ధరంగొన రామనాథబా
బచ్చమరామనాథయల ♦ నాగి ధరంగొన రంగమాంబగా
రచ్చిన బాబురంగమల ♦ నాగి ధరంగొన నచ్చమాంబ వా
కుచ్చువివాదము ల్సదరు ♦ కోర్టుననుండె ననేక కాలమున్.

క. పోరాటము ముప్పూరి కి
ట్లారూఢి న్సభలజరుగు♦నకాలమునన్
వారలరాష్ట్రమున న్నిం
డారిన జస్తీకమాయ ♦ షదిమెట్లనినన్. 84

క. కోరటు కచ్చమచే దా
వా రాబడునాటిసుద డి♦వాణపువా ర
వ్వారసులపైన తనఖీ
గా రహిమై దమనియోగి♦గణ మునుచుటయున్. 85

క. అయ్యెడ బహుధాచరితం
బయ్యె బ్రిభుత్వంబు కుట్రి♦లనవరతము మెం

డమ్యె నాఁమంద్యగ్రస్తం
బమ్యె న్దోరతనము వెలితి•యమ్యెంబెట్టుఁ. 86

—• రాజ్యపురాబడియంతయు ఉద్యోగులే తస్కరించుట. •—

క. హూణనియోక్తోద్యోగి
శ్రేణియు సంస్థానభరధు•రీణోద్యోగి
శ్రేణి కవగూడి రాజ్యా
రీణవ్యాపార మాచ•రింపుచు నచ్చోఁ. 87

ఉ. మేలగు కాల మిప్పగిది • మేకొనిరోఁ మనకంచుబొంగి తా
ణాలముతాల సోద్యములు • నాళ్లరకంబు వసూలుజేసి పే
చీలు ఘటిల్లె శిస్తిట వి•శిష్టము రాబడదంచు బైకి న
ర్జీలు లిఖించి స్వస్వహృత•శేషము జేరుతు రద్దివాణముఁ.

ఉ. వారికిచేష్టితం బెరుగ • బైయధికారులు లేరెయంచు నె
వ్వారనరా దహో ధరణి•వల్లభు నెల్లెడ జారచక్షు లిం
పారగ నాత్మకుం దెలియ•నాడిన వార్తలు నమ్మువారు కా
కారయ నెవ్వరైన గప•టాత్ముల డెందము జెందికందురే.

ఉ. ధూర్వహు లెవ్వ రేర్పడమి • దొట్టినతద్వ్యవహారు లబ్ధిన
య్యూర్వముహోలెరాష్ట్రమున•నందిన విత్తమునందిసట్లు ద
త్సర్వము గొల్లగొంట హాలి•సంతతి కుర్వర పండమిం దదీ
యోర్వరమీఁది ఫేషసు ల•యో ప్రతిసాలున బాకికాబడెఁ.

చ. వరముగు నగ్గడీకడిమి • వాకఎడిం దరు లుర్విమాడ్కి ను
ర్వరసిమల్లెపట్టుగతి • వాన వసుంధర కంచు దేలున

ట్లురగ హృతేందుబిం♦బవిధి ♦ నుష్ణతిథి న్మడుగింకఁబారు వై
ఖరి వ్యవహారదుష్కృతి పి♦కస్తుకువచ్చెఁగ్రమక్రమంబునన్.

క. అలఘుకుటుంబవివాదము
వలనన్ జప్తీన బ్రాభ♦వమునకు నేటీ
వులనధిపు లిడుటవలనం
గలిగె గడీకిడుము లట్టి♦కష్టంపుతరిన్. 92

—♦ కరువు ఏర్పడి శిస్తులు చెల్లకుండుట ♦—

సీ. దారుణోత్పాత సం♦తానానలారణి
దీనతూలౌఘఝుం♦ఝానిలంబు
సంతతాన్నదయశ♦శ్చంద్రశరద్రాత్రి
మతిధాన్యవత్స మూ♦హాబ్జహేళి
సకలసస్యచ్ఛద్మ♦సరసీనిదాఘంబు
పశువరతృణదావ♦పావకంబు
వార్షికాంభోధర♦వ్యాళమయూరంబు
దుష్టగ్రహద్వీపి♦స్తోమకుంజ
గీ. మగుచు దుర్భిక్షమెంతయు ♦ నరుగుదెంచె
నిఖలదేశంబులకు జంద్ర♦నేత్రదంతి (1821)
చంద్రసంఖ్యాకమగుహాయన♦శకపుటబ్ద
మందు నానాజనక్షోభ♦ మతిశయిల్ల. 93

వ. అత్తరి.

శా. గ్రామంబుల్ వయిరానుజెందె పశువ♦ర్గంబుల్ నశించెఁ జన
స్తోమంబుల్ నశియించె దస్కరులచే♦దోపిళ్లు మెండయ్యెనే

భూమింబై రునశించెనెంతయుబొలం♦బుల్ బీడుపాడయ్యెనా
సామీ లుర్విపరారిగాంచి రరికిన్♦ సర్కారు తల్లోపమిన్.

శా. క్షామాడంబరమట్లువర్తిలుడు నెం♦చ న్వాసిరెడ్డిక్షితి
న్సామాన్యంబుగ శిస్తాసంగుటకు నా♦సామీంలె లేరున్నచో
గాత్రిమైకద్వయ లట్టికర్షకులపై♦కంబుల్వసూల్జేసి తా
రామూలంబుహరించివైచి రఖిల♦వ్యాపారు లేపారగన్.

క. ఆవాసిరెడ్డిరాష్ట్రిము
వావిరి నక్కఅవ్వవలన♦వైభవహీనం
బై పరలె నార్వశ్రేయుని
చే బీల్వాబడెకుతొంటి♦సింధువుమాడ్కిన్. 96

మ. చను జప్తీస్థితి దుర్వివాదముల ద♦త్సంస్థానకోశంబు ని
ర్ధనమాటన్నఖరవ్రణోగ్రిముసలో♦త్పాతక్రియం గర్వ పై
కొనటర్ల రైతులనుండి శిస్తులవి బి♦ల్బూలాత్రికసర్కారు కొ
య్యన దత్సీమల ఫేమ్కషాషసలిక్రీ ♦ యావత్తుబాకీపడెన్.

ఉ. ఆరయ వాసిరెడ్డివిష♦యంబున కాదుగదా విదర్భగో
తాత్రిరమణీశులైనమల♦రాజలమానురులోనుగా జమీం
దారులసీమలన్నిటను ♦ దత్సమయంబున బేచిరాకునై
నీరసరీతు లూళ్లగుట ♦ నిల్వబడెర్ సరకారుఫేమ్కసుల్.

వ. అత్తరి.

క. బందరుగుంటురుజిల్లా
లం దొరతనమూను నలక♦లక్టరులు కరం

బెండందలికోస్తాలకు
బొందు సదరయిన జెన్న♦పురిబోర్డునకున్. 99

క. కస్టియగు రయితువారీ
శిస్తీజిల్లాలలోని ♦ క్షితిపతుల దరో
బస్తు ఫేష్కసులు కరువున
పిస్తాపడెనని రిపోర్టు ♦ వెసవ్రాయుటయున్. 100

క. అట్టి రిపోరటుమతలబు
గట్టిగ యోచించి సదధి♦కారులు తమ పై
మెట్టగు గౌనర్మెంటుకు
బెట్టిరొగిం బోర్డువారు ♦ పెద్దరిపోర్టున్. 101

ఉ. క్షామముదీరుచోనిచటి♦క్ష్మాధవులందఱుమఱి పికస్తులా
గ్రామములన్నియుఁ మఱి దు♦రస్తులుజేయుచు బీళ్లుపడ్డచే
ల్సామముజూపి రైతులకు ♦ జౌకకవుల్లిడి సాగొనర్చుచుఁ
క్షేమముగా స్వరాష్ట్రముల♦శిస్తులకుంపులడంపుచుండుడున్..

చ. సరిభువిరేండ్లగాష్ట్రముల♦చందముగఁ మఱివాసిరెడ్డినా
ళ్లిరవొనరింప నట్టిభర ♦ మెవ్వరియందునలేమి గర్వచే
హారువరినట్టి సీమలవి ♦ యట్లనయుండె నిజేశహీనసుం
దరివలె కర్తృహీనసద♦నక్రమమెన్నగ నిట్టిదేకదా!

—* హైకోర్టువారు అప్పీళ్లను విమర్శించి తీర్పుచేయుట *—

క. అట జెన్నపురంబున నొ
క్కొట నేకాగ్రమతి సదరు ♦ కోరటువారు

ద్భటవాసిరెడ్డికథనీ
త్యటమతులు పరిష్కరించి ♦ రది యెట్లనినన్. 104

చ. పరువడిదొల్లి లేటుపెద ♦ బాబును నీచినబాబు నిర్వురున్
పరుసనొసర్పునయ్యుపరి ♦ వాదపు కేసిపు డీత్రివాదకుల్
పరతనొసర్పు నీయుపరి ♦ వాదపుగ్రంథము వాసిరెడ్డిదై
జరుగు మొకద్దమీమినలు ♦ సర్వమునారయనయ్యెనెమ్మదిన్.

మ. కరమీవ్యాజ్యమునందు పాటిలు సట ♦ ల్గన్నారగన్నార మి
ద్దటినిందత్తుల వేంకటాద్రివసుధా ♦ ధ్యక్షుండుగై కొన్న పొం
పిరిదస్తైవజులంగనంబడుధరా ♦ భృత్పుత్త్రిలయ్యిర్వు రీ
సరిక్ బిట్టవిభక్తులై సవిధమే ♦ సాక్ష్యంబునందో చెడిన్.

మ. కలకత్తాదినహాపప్రభుస్థలసమా ♦ గ్రిన్యాయసమాత్రిట్సభా
విలసత్పండితసూక్తశాస్త్రమదియే ♦ ప్పైక్ రామనాథస్వీతీ
యలసద్దత్తత తత్సుభాషితము మే ♦ మంగీకృతింజేసి స
శ్చలితైతద్విషయంబుమార్చితిమథ ♦ స్సభ్యోక్తసిద్ధాంతమున్

మ. అవిభక్తైకకుటుంబమందున దదీ ♦ యజ్యేష్ఠుడంతంబునొం
ద వెనంగర్త కనిష్ఠుడాస్తికగు శా ♦ స్త్రోక్ జగన్నాథభూ
ధవునంతంబునరామనాథుడుప్రభు ♦ త్వప్రాప్తికింబాత్రుడా
త్మవిభుభాత్రినుపోష్యతాలవన సొం ♦ దంజెల్లునచ్చమ్మకున్.

మ. తరుణీయుగ్మమునందునచ్చమజగ ♦ న్నాథాగ్రిదే వేరియా
ట రికార్డందున దొచెజ్యేష్ఠసతియుం ♦ డన్నాథుడజ్యేష్ఠసుం
దరిక్ దత్తకుమారు నెట్టిడియె ని ♦ స్తథ్య బు రంగాంబికో
చ్చరితంబీవిషయానబిల్చితిమథ ♦ స్సభ్యోక్తరాద్ధాంతమున్.

క. అచ్చమ్మగారి వైఖరి
నిచ్చలు ధనమఖదివలన ♦ నెఱి మనవర్తిం
బుచ్చుకొనగ నర్హం బగు
గ్రిచ్చర నారంగమాంబ♦గా రటమీాదన్. 110

శా. ఆపాదించితి మిట్టినిర్ణయ మథో♦న్యాయాధిరాణ్ణిర్ణయ
వ్యాపారంబది యిట్లు మార్చితిమిమా♦పై వారుమాపైసలా
వ్యాపారంబిది మార్చునంతకు బ్రిభు♦త్వంబమ్మకీజావికే
మాపాదించితిమంచు దీర్పొసగి రా♦హైకోర్టుజడ్జీ లొగిన్.

చ. అనిమిషవైద్యనహ్నికల♦భాంబుజ (1832) హాయనశకాబ్దమందు మా
ర్చినెల బరిష్కరించి తమ ♦ చేయుక్రమంబున గోర్టువారు గొ
బ్బున జినబాబుగారికి బ్రి♦భుత్వమిడంగ బ్రికట్టువారిసి ర
వ్వినుతులు తారు తీర్పిడిన♦వెంటనె గొనరుమెంటువారికిన్.

క. ఆపగిది తీర్పు వినుచో
నాపెదబాబుసతులిరువు ♦ రతిదుఃఖితలై
రేపార రామనాథ
జ్యాపతి తామరల బొడమి ♦ నల్లలరారెన్. 113

మ. రహి న త్తీర్పున కోకసుల్లసిలిధ♦ర్మంబున్నిరూపించినా
రహహా యీపెదకోర్టువారు ప్రభుతే ♦ న్హాత్తింతు నీ కంచను
గ్రిహినై చేయుప్రతిజ్ఞకై పెనుచు నా ♦ గడ్డంబు వేవేగని
స్పృహనింకంగొరిగించుకొందుజయినై♦శ్రీరామనాథాధిపా
6

సీ. న్యాయాధిపతులు న్యా♦యమున నీనాఁటికి
నీనాఁటి కీభృత ♦ నీ కొఁసగిరి
కనరానిపగ జేయు ♦ కంటకసంతతి
గంటకసంతతి♦కరణి నేరు
మెలమిమై నిను నాశ్రి♦యించిన నర్థుల
నర్థుల గావింపు ♦ మధికకరుణ
వడి బేష్కషీ పెచి ♦ నిడి సరకారుతోఁ
గారు తోఁరంబుగా ♦ గయిగొఁనకుము
గీ. నీ వరి గ్రహించుచోఁ మేది♦నీజనంబు
నీజనం బని మదినెంచి ♦ నెరి మనుపుము
స్వతతి నీరక్ష నృపులింక ♦ నేల నాగ
నేల నాగరికోఁన్నతి ♦ నేలుకొఁనుము. 115

చ. అనిశుభలేఖ బంప గని ♦ యాతఁడు కన్నుల నద్దుకొఁంచు ని
ట్లునిచెగదా సమగ్రకృప ♦ నోఁకసుగా రని రామనాథబా
బనుగతహర్ష భారపుల♦కాంకురితాంగకుఁడౌచు మైత్రి పెం
పెనయగ దాని దాచుకొఁనె ♦ నిస్తిమిరాసనదంచు పెట్టియున్.

—♦ రాజ్యము రామనాథబాబుగారికి ఒప్పగింపబడుట ♦—

చ. సరగున కోఁర్టువారలపరి♦శ్పటున గొఁనరుమెంటువారు నే
త్రైర జినబాబుగారికి ద♦దీయవసుంధర నొఁప్పగింపు చీ
సరికి భవద్వసుంధర నె♦సంగఁబకాయ నోఁసంగబోఁలు న
క్కరము కరంబొఁసంగమికి♦గ్రిమ్మరజస్తునోఁన ర్తుమురర్వరన్.

చ. అనుచు నథోంతరాంతరవ♦చోనుగతిం దెలియంగజేయ గ్ర
న్నన నొక డెద్దియో యిరుకొ♦నర్చి వసుంధర నాక్రమింపద
ల్చినటుల దోచుచున్నయది♦చెచ్చెరగర్వున బేచిరాకు నొం
ది నిఖలరాష్ట్రిముండ సరి♦దెమ్మనురీతి నృపాలునీతియే.

చ. అని తలపోసి కర్రిమ్మట ర♦యంబున గొనరుమెంటువారు బం
పనగుసవాళ్లకెల్ల జిన♦బాబు జవాబొనరించె గొల్ల వో
యినయిలుకాలియారినకు♦భృద్వనమింకుముడుంగుమాడ్కిమా
జనపదము ద్వివాదమున ♦ జప్తున గర్వున బొత్తుగా జెడెన్.

మ. అరయందాదృశకారణంబుల బకా♦యాఫ్కెషసాప్పారె బం
దరుసర్కారు శివారుసీమలపయి♦న్లత్షాభిషట్కంబు గుం
టురు సర్కారుశివారు దేశములయం♦దున్లక్షలీరైదు న
క్కరము న్షోడశలక్ష లిట్టితరి దా♦ఖల్సేయగా నొర్తుమే.

క. వెస గోర్టుతీర్పుచొప్పున
రసనొసగుట మఱి బకాయ♦రకమునకై జ
ప్తైసగుట పసు పిదిగోయన
ముసు గిదిగోయనెడు సామ్య♦ముగనుండె భళీ. 121

ఉ. ఇప్పటినాళ్ల డౌళ్లఅయు♦డీ ప్రితిసా ల్సరకారువారికి
న్విప్పుగ మాయొసంగు నల♦ఫెష్కసుమట్టుకె హానిహానిగా
జొప్పడుచున్నదిట్టియెడ ♦ క్షోణి వెసందఖలిచ్చి పూర్వపుం
గప్పము దెమ్మటంచు మము♦గస్తియొనర్పగ నైవజున్నదే

చ. ప్రభుతవహించితోన నది♦బాయుటకంబె యథాప్రకారము
న్నభృశసుఖంబుమామకమ♦నంబునకుందమయాజ్ఞమాడ్కిరా

జ్యభృతిబడిం బకాయనిడు•నట్టికరా ర్రొనరింపజాల సం
చభిరతినై జవాబిడియె•నాతడు గౌనరుమెంటువారికిన్. 123

చ. క్రిమమెఱిగింపగా నమర•కంబుగణించి తమ _ త్తము ల్యథా
ర్థములనియెంచి రాష్ట్రముదు•ర _ స్తగునంతకు రాజ్యలాభన
ష్టములకు మేమెబాధ్యులము•ష్మాప్మపరివర్ధిలుదాకమీాకుమా
సమునకిరాఱునూరులునో•సంగుదుమంచుకరార్రొనర్చుచున్.

క. మీారాష్ట్రము బాగావఱి
కీర్తి భవద్ధరిత్రి • నేలుండసిటెం
పోరిగ నానరవరునకు
ధారుణి సర్కారువారు • దఖలొసగుటయున్. 125

ఉ. ఆరతి రామనాథమహీ•పాగ్రిణి గౌనరుమెంటువారు టెం
పోరిగ నిచ్చు నాగ్దరున • భూమి దఖల్గొని నేటి కిట్లు స
ర్కారుదయం బ్రభుత్వమిది•క్రమ్మఱకగ్గెనటంచుబొంగుచుర్వ
ధారుణిపాలనంబు నిర•తంబొనరింపదొడంగె వెండియున్.

ఉ. కూరిమిబాబుకై సదరు • కోరటువా రిది యక్రమంబు జే
కూరిచినారు దీనిపయి • గొబ్బున బారలమెంటున న్మరా
ఫారచియింపకుండుదుమె• పాభ్రినమీాయన కెట్లుహక్కులా
నారయమాకుమాకనుచు•నచ్చమరంగమగార్లు చెచ్చెఱన్.

—• ప్రీవీకౌన్సిలుఅప్పీలు •—

క. ఇతరేతరవిజిగీషా
మతులగు తా రిఱువు రా _ ష్ట్రి • మదరాసు సభా

పతు లిడుతీర్పునక ల్లా.
తతరతి గ్గైకొనుచు దొంటి ♦ తమ డిఫెనసులన్. 128

క. సర్వాధికారవర్ధూ
ణోర్వీధూర్వహసమస్య ♦ నొగి నప్పీలుం
బర్వింప దత్ప్రితికి ప్రియ
బర్వించె నాప్రిమరాధ ♦ బాబు న్నజిలన్. 129

ఉ. ఇక్కరణిం బరస్పర జ♦యేచ్ఛ వకీళ్ల నమర్చి వాదనం
బాక్కొటనున్నతోన్నతపు♦హూణులకొల్వులజేసి యొక్కచో
నొక్కరునొక్కచోనొకరు♦నోడుచు గెల్చుచుమూడువీళ్ల వా
రుక్కర కొండొరుంబెనగు♦చుండ గ్రమించె ననేకవర్షముల్.

చ. అటువలెధాత్రి ధూర్వహత♦హ త్తి రహించినబాబుగారుసం
కటమగు నట్టికర్వీన పి♦క స్తగునూళ్లు దురస్తుజేయు చు
ద్భటవిభ వాభిరాముడయి♦ భాసిలుచుండగజూచియోర్వ క
క్కటకట తన్మహీరమణు♦కంటకులై నపితూరికాం డ్రొగిన్.

శా. వ్యాకీర్ణోపరివాదభీతి గుతలం♦బాయ త్తమైయుంట ముం
దేకాలంబెటులుండునో యిపుడెసా♦మ్మెం తెనియుంగూరుప
న్నా కౌబోయని రామనాధ వసుధా♦నాధుండువిత్తాశుడై
లోకంబున్బహుభంగులన్న లిపితా♦లూకాలుజూరంగొనెన్.

ఉ. శ్రీయుతుడయ్యు దా నిరవ♦శేషముగా బ్రితివత్సరంబు ప
న్నీయక సేచిపెట్టెడు మ♦హీజన మీవిభు కర్కశప్రిభు
త్వాయతికోర్వలేమనుచు♦నారట మొందుచు నుండెడిట్టిచో
నీయన కేల నుంచవలె ♦ నీసరణిన్ధరణీధురీణతన్. 133

మ. అని యర్జీలు ఘటింప హూణవిభులా ♦ యర్జీలు వీక్షించి గ్రి
ద్దన స్వప్రార్థనపట్టి ప్రాక్కరముస ♦ ద్వ్యాప్కాలమందాపి జీ
వన మేర్పాటొనరించి దేశములనా ♦ బాధూన్నముంచూన్న నె
ట్టన నాబాదగు పైకమీక ప్రజబీ ♦ డంబెట్టసాగెంగదా.

ఉ. ఆజనపాలు ప్రాక్కర చ ♦ యంబుగొనందగుదత్కరంబునీ
మోజ నొసంగలేమనిన ♦ నుర్విగొనందగునంచు నెంచి మీ
రీజనుతొంటి పేష్కసిక ♦ నీయమిచోధర జప్తు చేసి హ
రాజొనరించు వారమని ♦ వ్రాసిన నాచినబాబుగా రెదన్.

మ. వికసద్ధూణనియోగితప్రభులచే ♦ విశ్వస్వమున్గాటిమై
ప్రకట ప్రాజ్ఞు విపద్గతింబడసి జా ♦ గ్రిద్ధంశికాపీత ని
స్సకలక్షాదరిఖరాంశుశుష్కితమధూ ♦ చ్ఛత్రాకృతింబొల్చుగో
త్రికు నేనాఢ్యుడనైతి దీనికిని నో ♦ ర్వంలేరుగాకంటకుల్.

క. అనిననరుచు మాయెడ నొం
టని వారటు కొండెముల్ద ♦ నర్చిరటంచుం
దనమీది పికాయరులం
దనరన్నవరించుకొను చ ♦ తం దుండుటయున్. 137

ఉ. భూరిమిథోజిగీష మెయి ♦ భోరననొండొరుతో బెనఁగుచ
వ్వారసులుండుట న్మఠిది ♦ వాణపుపేష్కసులేటికేటికే
పారబకాయ బెంపగుట ♦ నక్కట రాష్ట్రముదగ్గుణద్వయ
పేరిణ నూతియొడ్డు పసి ♦ బడ్డ విధాయకమయ్యెనయ్యెడన్.

—• ఎల్ల్యాటుధొరగారి కమిటీ విచారణ •—

చ. కరువరయ న్కమిషనరు•గా నెలియాటను హుణభర్తను
ర్వర దమకల్కటర్వగఙు • రాలహుషారియు నేలనేలు భూ
మిరమణపాళిచర్యలు జ•మీనులమీది ఒకాయ పేష్కసుల్
త్వర గమిటీయొనర్పుమని•పంచిరి చెన్నపురీ ప్రభూత్తముల్.

క. పయివారిచే నియుక్తుం
డయి భృత్యామాత్యభటము•ఖాఖిల జన సం
చయము తను గొల్చిరా నెం
తయు వడి మదరాసునుండి • తరలినవాడై. 14

మ. అజతుల్యప్రతిభావచోనిధి యథా•ర్థాత్ముండు జిల్లాలహూ
ణజనేశాళిశిరోభరంబు తదధో•నానోద్యమిస్పర్శనా
హిజమీందారులపాలిమృత్యువననా•యెల్ల్యాటువచ్చెన్జమీ
న్తజీవీజారయకొండకాండ్రి జెలియై•నార్తిద్రిదివాణాలకున్.

వ. అట్లు వచ్చి,

మ. కమిటీపూని పితూరికాండ్రినుడి నా•గశ్రేణిరాదీసి వే
గమహోద్యోగుల నెల్లవారలను దో•కల్గొసిసున్నంబిడుం
దమహూణాధిపులందునైన నపరా•ధంబున్న బైకినిప్రో
ర్బమరించు న్సరకారుపన్నుదిగుబా•టా రేండ్ల సిమల్గొనన్.

మ. చిఱుదొడ్డంచు దలంపకిట్లుత డహో • జిల్లాల తాణాల కుప్రి
మ్మాటి నానాసరదారులం జఱుతల•న్మంతుల్విరోధించి యం

దఱిశిక్షింపుచునందుబూనెతమగు♦ త్తల్రానిగుంటూరుబం
దరుజిల్లాలధరాధురీణులయు♦దంతంబుల్విమర్శింపగన్. 143

గీ. పూని వాసిరెడ్డి ♦ మానూరుమాణిక్య
రావు కముజులమల♦రాజుకీ స
రవరిగొండవగయు♦రాజమీందారుల
దగుకమాయషు దఱి♦యాస్తు జేసి. 144

ఉ. వారలలో బకాయపడు♦వాఁగుఱించి బకాయ లింక నీ
లేరు ప్రభుత్వము ల్సలప♦లేరు బకాయలక్రిందనూళ్లు
ర్కారు వశంబొనర్చుకొని ♦ రాబడికిందగినట్లు నీజమీం
దారులకెల్ల లౌనసులొ♦నర్చుట బాగని వ్రాసివెండియుః.

ఉ. ఆనిఖిలాధినాథచరి♦తావళివ్రాయుచు వాసిరెడ్డి సం
స్థానము శిలమెత్తియిది ♦ సాంద్రయశోధన వేంకటాద్రిభూ
జానిముఖాద్యపుణ్యనృప♦ సంభృతమున్బహురాష్ట్రసంగతం
బైనది గొప్పకప్ప మిడు♦నట్టిది దీనినిబోల వెవ్వియున్.

క. ఈవాసిరెడ్డి సంస్థా
నావాసుండగుచు నిప్పు♦డదవగ బ్రభుతం
గావించు రామనాథమ
హీవరు డెటువంటివాడ♦యినది లిఖింతుః. 147

ఉ. కాటకపుంబ్రభుండు సర♦కారున దర్పరవర్షులాత్మ నే
పాటియు బూనడై వజును ♦ వచ్చినదెల్ల హరించిబాకి యే
ర్పాటొనరించినాడు నిర♦పాయవచోనిధి వాసిరెడ్డియె
స్టేటుకు జేటుపాటిలగ♦జేసినవాడు సదా యితండగుః. 148

ఉ. ఈయన యెట్టివాడయిన ♦ నేమియగు న్సరకారువారు రా
ణ్ప్రియసులాదిగా గలుగు ♦ ఫేమిలివిశ్రుతిబట్టి రాష్ట్రివ
ర్గాయతిపట్టియు న్లవన♦సారయ సాలుకు నొక్కలక్షరూ
పాయలు వాసిరెడ్డినృప♦వంశ్యపరంపర కీయగాదగుఁ. 149

క. మఱి వారు సంతతము గా
పురముఁ గావించుచున్న♦పురవరముం బెం
పరువారికిఁ గ్రింద నుంచగ
గరము దివాణంబువారు ♦ కరుణింపదగుఁ. 150

క. అని యీలాగున నెల్యా
టనెడు కమీషనరు రేండ్ల ♦ దంతయు దర్యా
ప్తొనరించి యారికార్డుం
బనిచె దనరిపోర్టుతోడ ♦ బయివారలకుఁ 151

వ. కాని కమిటీయొనర్చునకాలంబున,

గీ. వాల్టరెల్యాటు మతిపార♦బాటునేనొ
కాకసర్కారు కఖిలంబు ♦ గలపు తలపు
చేతనో వాసిరెడ్డియె ♦ స్టేట్లవిషయ
మై క్రిమంపువిమర్శ సే♦యబడదయ్యె. 152

వ. అది యెట్లనిన,

సీ. అలజగన్నాథబా♦బధిపుహాయామున
నొకపై సయును బాకి♦యొదవదుగద

మఱి పరస్పరకుటుం♦బవివాద హేతువు
వలన గౌనర్మెంటు♦వశమునందు
'రామనాథక్షమా♦రమణువశంబున
నానాప్రభుత్వంబు ♦ నడువనయ్యె
నయ్యుభయ ప్రాభ♦వావసరంబున
సర్కారువారి పే♦ష్కసు బకాయ
గీ. పడియె నొక కొన్ని యెస్టేట్ల♦వలె నిదిట్లు
జరిగియుండ విచారణ♦తేరి బకాయ
యెవరియధికారమందలి ♦ దేవహీల
వలనిదైనది దర్యాప్తు♦సలుపడయ్యె.

మ. కమిటీ నట్లొనరించినట్లయిన రూ♦క ల్బాకిపడ్డట్టి కొ
న్నిముతాలు న్నెఱిబాకిలేని వగు నెం♦ తేకొండపల్యాది కొ
న్నిముతాలున్సకలంబునొక్కటియుగా♦నేయెంచి రాష్ట్రంబున
ర్వము నాబాకికినా గొనంగననుచుం ♦ బై వారికిన్వ్రాయునే

శా. ప్రీవీకౌనిసిలందు నప్పటికి న♦ప్పీలీర్పుకాకుండెనా
దానాయెవ్వనివైపు దీరుపగు నా♦తండర్హుడౌగా బకా
యావిత్తంబు జవాబుదారి కల తీ♦ర్పొదాకతత్సర్వసీ
మావృత్తాంతవిమర్శనిల్పుటకు నా♦త్మశ్రద్ధల్పడయ్యెన్భళీ.

మ. అట లండన్సభవారితీరుపగుప♦ర్యంతంబు వాల్లభ్యమ
ప్పటికిన్నిల్ప శిఫారొసంగవలదా ♦ పై వారికట్లైన నా
దట జెల్లింపడె హక్కుదారుడరి దా♦దద్రీతిగావింప డ
య్యెటకాయించి యభాగ్యమిట్లొదవుబో♦ యెట్లట్టి మేల్పేకురుర్.

వ. గతజలసేతుబంధనక్రమంబున గడచిన వృత్తాంతం బను
నది యేమి యయ్యనువున విచారించిన రికార్డు సర్వంబు
బైవారికిం బనిచి వాల్టరెల్యాటు పెరజిల్లాలకమిటీకి యథే
చ్ఛం జనియెనంత.

—• రాష్ట్రములన్నియు రివిన్యూబాకీక్రింద వేలమగుట •—

శా. ఎల్యాటంపిన యారికార్డును రిపో•ర్టీక్షించియెల్యాటహా
బల్యుక్తిం దెలిపె స్థరాధరులతో • బాకీలపేచీ ల్జనే
జాల్యోచించి తదీభ్యలేఖితవచః•సంసూచితార్థంబు సా
ఫల్యంబందగజేయుటొప్పుననుచుం • బైవారుదోడ్తోడుగన్

శా. జిల్లాలందలిహూణభర్తలకు మీ•జిల్లాలధాత్రీధరు
ల్సెల్లింపంబడనట్టి పేష్కసులకై • శీఘ్రంబుగా నాజమీా
ల్లెల్లగౌనరుమెంటుక్రిందను గ్రమం• బేపారమీా పేళ్లశో
భిల్లన్వేలముపాడి చేర్పుడనుచుం • బిట్టార్డరుంజేయుచున్.

మ. అతిపౌర్వార్జితరాజ్యముల్సమసెగా•యంచుర్వ్యథాసారసం
ప్లుతచిత్తాబ్జులుగాక యుండుడిదెతా•లూకాలు బాగైకర
ప్రితతు ల్దీరినతోన నిచ్చెదము మీా•రాజ్యాలు మీాకంచినా
యతునామాల్సరకారువారనిచిర•య్యాయాజమీాందార్లకున్.

మ. మఱిడిస్ట్రిక్టకలెక్టరు ల్దమకున•మ్మద్రాసువారిచ్చునా
ర్డరుచేతం దమపేళ్ల వేలములబా • టల్పాడి సర్కారుకు
న్సరకారర్థముక్రింద జేరిచిరి బం•దాళోరు లౌనావిద
ర్భరసాధీశుల రాష్ట్రసంచయముస•ర్వంబొక్కొటంగ్రక్కునన్.

గీ. అందు వాసిరెడ్డి • వయిన మెస్టేట్లనా
బాదియయినపిదప • వారసుల కొ
సంగదలచి యిపుడు • సర్కారున సమూదు
పఱుతు మెవరు పాట•పాడవలదు. 162

క. అని జట్టికాండ్రి కార్డరు
దసరిచి కృష్ణోభ యోరు•తటకనదుపప
ర్తనము లయి దైదు వేలకు
గొనిరి ఖరీదులు ఘటించి • కుతలాధ్యక్షుల్. 163

ఉ. బాపురె యట్టివేళ పయి•వారికి రంగమపుత్రుడైన ల
క్ష్మీపతినాయకుప్రభుని•చే నిడనయ్యె బిటీష నేముయూ
గోపున జేయువాదము ని•రూపణమయ్యెడుదాక నిల్పనా
మాపృధివీవిమర్శయన • మంచిజవా బిడరైరి దానికిన్.

మ. ధరణీశుల్వెతనొంద వారలప్రభు•త్వాలిట్లు సర్కారువా
రఱయఁస్వాంతరపర్వతప్రతతిన•య్యంభోధి లోగొన్నమా
దిరి నొక్కుమ్మడి నాక్రమించిరకటా•దీవ్యన్మహావాహినీ
శ్వరులుప్పొంగినస్వాంతరస్థితికుభృ•ద్వర్గోన్నతుల్ ద్రుంగవే.

ఉ. తా రిచటన్ఘటించినయు•దంతముకల్కటరుల్ రయాన పై
వారికి వ్రాసిపంపుటయు • వా రదినెట్టన జిత్తగించి పై
వారగదత్ప్రభుత్వముల • వచ్చెడు నైవజుపట్టి యజ్జమీన్
దారుల కేర్పఱించి రుచి•తంబుగ వత్సరజీవనాంశముల్.

—* జమీందార్లకు లవణసుల నేర్పాటుచేయుట *—

క. కొండలికి వేయికిం బది
కొండలికి న్వేయి కయిదు • కొండలి కిశే
న్వందలకు మూడు తను రీ
చందంబున నేర్పఱిచిరి • సరగ లవణసుల్. 167

గీ. అట్లులవణసులొనరించు•నవసరమున
బహుళరాష్ట్రాధికారధూ•ర్వహ మరీణ
రాణివాసజనాఢ్యమై • ప్రబలుచున్న
వాసిరెడ్డికుటుంబంబు•వారిలోన. 168

సీ. మన్నెసుల్తానగ్ర• మహిషికి వెరెమ్మ
గారికేబదియు ము•న్నూరు నూరు
నతనిరెండవరాణి • యగుపార్వతమ్మకు
నీరీరునూరుల•నే బదియును
మఱిజగన్నాథభూ•మహిళకు నచ్చమ్మ
గారి కేబదియు ని•న్నూరునూరు
నతనికడమజాయ • మైనట్టిరంగమ్మ
గారి కేబదియు ని•న్నూరునూరు
గీ. రామనాథభూజానక•భ్రాత్రరామ
నాయడుప్రభునకు జగ•న్నాథ జాన
కాగ్రభవపద్మనాభరా•మాధిపతికి
నెనిమిదిశతాలు తత్పూర్వ • మేరుపడియె. 169

గీ. వాసిరెడ్డికుటుంబంపు♦వారి కిట్లు
లవణ సైయుంట నపుడు వా♦ల్లభ్యమూను
రామనాథవసుంధరా♦రమణునకును
నెలనెలకు వేయురూపాయ ♦ లలవరిచిరి. 170

క. వేయిటికి పదియు మూడు
న్మాయీడగువా రొసగి ♦ మాకవ్వరుసన్
హా వేర్పరింపరై రిక
దా యనుచున్ రామనాథ♦ధరణీపుడాత్మన్. 171

మ. అల మెల్యాటు హుజూరు కంపిన రిపో♦ర్టైనన్విచారింపకా
త్మలకు న్దోఁచినమాడ్కి జేసిరకటా ♦ మద్రాసువా రేషుల
క్షులపై చిల్లర పేష్కషై దశశత♦గ్రామాళికిం బ్రాభవం
బలరారించిన మేటికిన్ లవణసా ♦ హావేయిరూపాయలా.

ఉ. ప్రాభవ మాక్రమించుటకు♦వ్రాయుసిఫారసు నాదరించిగో
త్రాభుజజీవనాదులకు ♦ వ్రాయుసిఫారసు నేవగించి రా
హా భగవత్సమానులయి♦నట్టిదివాణపువారు బాకికై
మాభువి నాక్రమించిన గ్రామంబగులానసునై నగూర్చిరే.

వ. అని మనంబునం జింతించి

శా. ఈమెస్టేటుకు గర్త సీమసభవా ♦ రెవ్వాని గావింతురో
యేయత్నంబిపుడేల నాకునని యో♦యింపేదిరాజ్యంబుహూ
ణాయత్తంబగుట న్మనం బెరసి యో♦యా వేయిరూపాయ ల
న్యాయంబిట్లిడ మాకు మీరనకతం♦డామట్టు కేకై కొనెన్.

మ. ఇదియొక్కండనవేల నక్కమితినే • యెస్టేటుతీ ర్పట్టిదై
నదియెల్యాటుకునాన్నృపాలకుడహో•న్యాయంబుబోధించెనే
ని దివాణాలకు బాకిలేనివయిన • స్నిల్పుంగదా యట్టియొ
ప్పిదముల్చెప్పక సర్వరాష్ట్రిసమితి • న్వే కోర్టున న్జేరిచెన్.

క. ఆమెగదా గడచినపని
కై యనునదియేమి లవణ • సటు నెల వేరూ
పాయలు గొనుచుం దా నిర
పాయుండై రామనాథ•బా బుండుటయున్. 176

క. కోరట్లవారివలనం
బోరడగమినవ్వాకీళ్ల •మూలంబుగ న
య్యారోపున నప్పీలుం
దారుపనదియేండ్లకొలది • తత్సభ నుండెన్. 177

క. పదునెనిమిదివందలనలు
బదియాఱవహూణశకపు•వత్సరమున సీ
మదొర లోక సావధానపు
టదనున నాతగవుదీర్చి • రదియెట్లనినన్. 178

—• పార్లమెంటువారితీర్పు •—

చ. వడి నలపార్లమెంటుసభ•వారు రికార్డునుజూచి యెంతయుం
దడవితి మింక నొక్కనికి • దత్తతనూభవు లిర్వురుండు టే
ర్పడ దది లాకు వేటగుట • రద్దొనరించినవార మాక్టుచొ
ప్పడరగ రామనాథవసు•ధాధిపుడొందు ద్వితీయదత్తతన్.

మ. తను దర్శింపగనేగుదెంచినజగ•న్నాథేభ్యుల్లో నున్నరా
తనయు న్వీడెవడన్న మత్సుతుడు ద• త్తస్వీకృతుండంచు న
జ్జననాథుండెరిగించె నా కనుచు సా•క్ష్యంబిచ్చెరాబర్టునా
జనుజిల్లావిభుసూక్తినమ్మితిమిమా•స్వాంతంబునన్గావునన్.

మ. నడుపంబోలవు క్రిందితీర్పులు జగ•న్నాథాధిరాడ్దత్తపు
త్రిదులక్ష్మీపతినాయడాత్మపితృసం•యూథపరిభృత్యాప్తిక
ర్హుడు, తద్దత్తత నమ్మనారమని తీ•ర్పుంజేసి రింగ్లాండునం
దడరం బారలమెంటువారు విక్టో•ర్యారాణిగా రౌనసన్.

క. ఆపగిది నధోధర్మస
భాపతులిందు బొరపడిన•వారనుచు దదా
రోపితవిధి మార్పుగ యూ
రోపుదొరల్తీరుపు న్ని•రూపించి వెసన్. 182

శా. ఆతీర్పవ్వసువార్ధిభశశి(1848) హాయా•ణాబ్దంబునందంపగా
నేతద్వత్సరమందు మార్చినెలయం•దింగ్లాండునుండిండియా
కే తెంచెన్నని వాసిరెడ్డ్యుభయధా•త్రీశుల్త దీయప్రజా
వ్రాతంబుల్ముదముత్పయోధిఝరని•ర్మగ్నాత్ములై వర్తిలన్.

గీ. వరుసనీమతీర్పు • వచ్చెడువఱకు క
ప్పంబు బాకిపడుట • పన్నుక్రింద
బ్రాభవంబు వోయి • రామనాథక్షమా
పతికి లవన సేరు•పడుటవలన. 184

క. ఆయనకు నొసగు వేరూ
పాయలు సర్కారువారు • పైతీర్పున భూ

నాయకుడగు లక్ష్మీపతి
నాయునకున్ టాప్రిన్సుఫరు నొ•నర్చిరి పెలుచన్. 185

క. వెస లక్ష్మీపతినాయం
డెసఁగ దను న్యాపిరెడ్డి•యెస్టేటుకు వా
రసుజేసి కుంపిణీవా
రొసగెడు లవనసు సహాస్రి • మొందుచు నాత్మన్. 186

—• లక్ష్మీపతిగారు కాంచీనగరమున నివాస మేర్పాటు చేసికొనుట•—

ఉ. న్యాయము ఫైసలై దొరత•నంబు లభించెడునంతలో నృప
శ్రీ యిటు రామనాథనృపు•చే సమసె న్మనవర్తికల్గె నిం
కీయెడనున్న నేమి మఱి • యేయెడనుండిననేమి వేయిరూ
పాయలుఁజీవనానికి ది•వాణపువార లొసంగ కుందురే. 187

మ. మఱలన్యత్న మొనర్చి ప్రాభవము సం•పాదింపనౌ నాకు న
య్యురుయత్నంబు ఫలింప జేయుసర కా•రున్నట్టిమద్రాసు దా
పిరి యుద్యత్సుకృతాళికిన్వరదరా•జేకాను ప్రినాథాఖ్య తా
ర్క్ష్యరథేశానుల కున్కిపట్టగుపురిం•గాంచి న్వసింపందగున్

మ. అనియూహించిస్వబాంధవాప్తభటభృత్యామాత్యవర్గంబుతో
జని లక్ష్మీపతినాయఁడుప్రభుడు చం•చచ్చోళరాడ్ధానియై
జనుకాంచీనగరిన్వసించినిజరా•జ్యశ్రీకి మదాప్రిసునం
దునయత్నించినినందుజొప్పడమిచే•దోడ్తోడనింగ్లాండుకున్

—♦ లక్ష్మీపతిగారు తిరిగి రాజ్యమును రాబట్టుటకు అర్జీపెట్టుట ♦—

శా. తాలూకాలు భవత్పరిష్కృతవిధిం ♦ దారీడవారీ రటం
చా లక్ష్మీపతినాయడుప్రభువరుం ♦డర్జీ ఘటింపంగ న
బ్బాలాదస్తులొసంగుడంచు హుకుము♦న్బంపించిన స్వీర ల
జ్జోలిందల్పకు దుర్విబాకిపడెనం♦చుం దెల్పగా గ్రిమ్మబుఁ.

సీ. అల వేంకటాద్రి నా♦యడుజగన్నాధబా
బులహయాముల బాకి ♦ కలుగదుగద
రామనాథక్షమా♦రమణుచే టెంపోరి
గా ప్రభుత్వంబు స ♦ ర్కారువారు
చేయించునప్పు డె♦స్టేట్లలో గొన్నిటి
యందు పేష్కసు బకా♦యఘటియిల్లె
నరి దిగబాటగు♦వరకు లండనుసభ
నప్పీలు తీర్పగా ♦ కట్లయుండె

గీ. నిట్టి దుస్సమయంబున ♦ నెల్లప్రాభ
వంబునకు రామనాథు నే♦ర్పఱచి యతని
ప్రభుత గతిపయసీమల♦బడుబకాయ
కథలసీమలు గైకొన ♦ నగునెసబబు. 191

ఉ. పారలమెంటువా రెవని ♦ ప్రాభవకర్త నొనర్తు రజ్జమీం
దా రరికింజబాబిడగ ♦ దక్షుడగుంగద యట్టి తీర్పు పై
వారిడుదాకనిల్పి పిద♦పందగురీతి బ్రభుత్వపుందఖల్
దారుని హాజరుంచుకొని ♦ తత్పరిశీలన సేయనౌకదా. 192

ఉ. అక్కరణిస్టటింపక మ♦హాత్వరచే గమిఠీనొనర్చి తా
రొక్కడొనర్చు బాకికయి ♦ యొక్కనిహక్కునునాక్రమించులా
గెక్కడ, నేకమాయషున ♦ నెవ్వరమెన్న డెఱుంగ మిట్టిచో
నక్కమిఠీపరిభుం డిడిన ♦ యకరిమము స్సనరింపగాదగుఙ.

ఉ. ఆధునికాధికారము మ♦దన్వయజాతుడు రామనాథగో
త్రాధిపు డూనుకాలమున♦నై నబకాయరకానకై జగ
న్నాథనృపాలు వారసుని ♦ న్యాయపుహక్కునుదీసికొంట న్యా
యాధిపులై నమీకు నిది ♦ న్యాయముకాదని తల్పనౌకదా.

మ. ఇదియిట్లుగడగనిండు, వేర్పడి కరా ♦ లెస్సేట్లకుండం, గరా
లు దిగంబడ్డముతాలతోగలపి, బి♦ల్యూల్బాకి లేనట్టి, నా
ళ్లదరోబస్తాకచో గ్రహించి రిదిరూ♦ల్గాదంచు సర్కారువా
రదయత్వంబెదమాని,మాకయినయ♦న్యాయంబుబాపందగుఙ.

చ. కలవుననైనబాకికద ♦ కాపులకట్లురిమాన్పకున్న నొం
డిరుతిగవాయిదాలయిున ♦ నీయక కొద్దిక్రయాన కీవసుం
ధరగొని రిట్లు ధర్మమును♦దార్పక మామకపూర్వభూపు లే
త్తెర సరకారుకేమి యవి♦ధేయతసల్పి రదేమి లేదుగా.

సీ. ఇస్తిమిరాసన ♦ దెనయుచో సర్కారు
చిత్తవృత్తికి వేఱు ♦ జేసినారొ
యాలగాయతు పరితి♦సాలు కప్పమునీక
పేచీలు తేడీలు ♦ పెట్టినారొ
నాడునాటికి దివా♦ణమున కిష్టముకాని
చర్య లెన్నండేని ♦ సల్పినారొ

స్వామిభృత్యన్యాయ ♦ సరణిబూనక తమ
మెడల బిట్టహామిక ♦ నడపినారొ
గీ. యరయ నింగ్లీషువారికి ♦ నస్మదాదు
లకట తప్పేమి చేయలే♦దట్టివారి
వారసులమగు మా ప్రభు♦త్వంబు దున్న
మయపుటిరుకున నాక్రమిం♦పంగ జనునె. 197

చ. పసచెడి మాధరిత్రి దిగ♦బడ్డబకాయ విచారణాకరుం
డనమమనీపి వాల్టరెలి ♦ యా టొనరించు సిఫారసైన న
గ్ర్యసభకు లాదరింపరయి ♦ రాతడు మామకరాజధానిమై
మెనగుపురంబు,లక్షమన♦వృత్తియుమాకునిడంగ వ్రాసెగా.

సీ. అది యట్లనుండనిం ♦ డరిబాకికై జమీ౯
దఖలు తప్పిన వసు♦ధావరులకు
కొందరకీరైదు♦వందలకు పది కొం
దలకు నీరైదు వం♦దలకు నైదు
కొందలకీరైదు ♦ వందలకును మూడు
నిమ్మాన్యడిక్లరెౌనసు♦లేరు పరచి
రీతివిధములలో ♦ నేవిధినైన మా
యఖిలోర్వి రాబడి ♦ ననుసరించి
గీ. లౌనసు ఘటింప రైరేడు ♦ లక్ష లేట
పేష్కసు నొసంగునది యశో♦వృత మయినది
యైన మా మహనీయ సం♦స్థాన మధిక
హైన్య మొందింపజేయు ఛీ♦న్యాయపథము. 199

మ. కరములెత్తలేనివయ్యు గైకొనినవై • కైకొంటకు న్నాదుగా
నెరకాసేనియు లౌనసీనిదగు దా•నిం గొండపల్లాది బం
దరు డిస్ట్రిక్టుననున్న మావివిధగో•త్రామండలం బూరకే
సరకారందున జేరె దానిని విమ•ర్శం జేయ న్యాయంబగున్.

ఉ. వారసుకానితా నవని•పాలనసల్పిన రామనాథభూ
దారు డొనర్చు సక్రమవి•ధంబులులేశము హేడ్డు ఫేమిలీ
దారుని హక్కునడ్డవు క•దా యిదియంతయు చిత్తగించిమా
ధారుణి మాకునేలుకొన • ధర్మవిధిందయ సేయగాదగున్.

చ. వలనగు సార్వభౌములగు•వార లనిం దమ సాటివారలం
గెలిచిన నాత్మతుష్టియగు • గేవల మాశ్రితకోటిసల్పినం
గలిగెడిలాభమేమి? కృత • గంధకరీంద్రవపానుభూతిచే
నెలమి వహించుగాక హరి • కీగలచే జఠరాగ్ని తీరునే.

క. ఒకరు పొరబడినచో వే
రొక రైనం దాని మటల • నుడుపుచు నిచ్చల్
సకలోర్వి ధర్మపద్ధతి
ప్రకటించెడు ప్రభులు మమ్ము • పాలింప దగున్. 203

ఉ. న్యాయముదప్పిన న్నవర•ణంబునకై తమలోనగొందఱిం
న్యాయసభాధికారుల నొ•నర్చిరి గౌనరుమెంటువా రహో
న్యాయముపట్లనన్యులయి•నం దమవైరెన నొకండె యీదృశ
న్యాయపరాయణు ల్ధరణి•యందున లేరని నిశ్చయించెదన్.

సీ. ఉత్కోచ ముద్యోగు • లుత్సహింపక యుండ
సంబడం బభివృద్ధి • సల్పినారు
మహిపాలన గుఱించి • బహుబుధాభిప్రాయ
మెఱుగ నీటింగు లే•ర్పఱచినారు
స్వమతి కెచ్చరికగా • తమపరా కేనియు
దెలుప నెమ్మది సమ్మ•తించినారు
దిగువ ప్రమాదం బె•ఱుగ నున్నతోన్నత
ధర్మాధికారుల • దార్చినారు

గీ. న్యాయమందు నిఘాయింతె • ఖాయపర్చి
ప్రాభవంబును నడిపించు • ప్రభువులెవరు
స్పష్ట మింగ్లీషువారలే • ప్రభువు లట్టి
వారు మాకైన సేగిని • బాపుటెంత. 205

సీ. నలహరిశ్చంద్రాది•కుల న్యాయవిధి ఘటి
యిల్లె యీకాలంబు • కృతయుగంబొ
రఘుపుంగవాదుల • రాజ్యంబు సమకూరె
నీయనేహంబు త్రే•తాయుగంబొ
ధర్మరాజాదుల • ధర్మంబు పొడసూపె
దలప నీసమయంబు • ద్వాపరంబొ
విక్రమార్కాదుల • విశ్రుతనయమార్గ
మడరె నీ యదను క•ల్యాదితఱియొ

గీ. యని ప్రమాయత్తచిత్తులై • యఖిలభూజ
నంబు స్వీకృతాధికారంబు•నకు నఖండ

హర్ష మొందంగ సమధిక♦న్యాయవిభుత
మెఱయుచున్నారుగద గవర్♦న్మెంటువారు. 206

సీ. తతమహఃపూర్వాభ్యు♦దయముగైకొనుట వరి
చేతఃపరిగోయుక్తిఁ♦చే నెసగుట
దర్పితశార్వర♦ధ్వంసంబొనర్చుట
భువనజాతోల్లాస♦పూర్తినిడుట
మీఱినరాజు బ♦ల్మి నడంచి వెలయుట
యఖిలచక్రాధిప♦త్యమున మనుట
యనిశంబు సన్మార్గ♦మున బ్రివర్తించుట
దృఢపంక్తతతు లింక ♦ దేజరిలుట

గీ. యలర మూర్తిత్రియాత్మకుం ♦ డయినరవికి
పృథులహూణాధిపులకు స♦భేద్యము భగ
వంతుడు దివాణ 'మొక టను♦వార్త సత్య
మందుచే నుభయత్రి ని♦నాఖ్య యొదవె. 207

క. భగవద్రూపము తమరై
జగతీపరిపాలనంబు ♦ సలిపెడు తమకు
న్దగవగునె మాదృశాశ్రితు
లగడుపడంజేయ నోమ♦హామహులారా. 208

క. కావున కేవలదయచే
మావాల్లభ్యంబు మాకు ♦ మఱల నిడి మముం
బ్రోవుం డని హూణేంద్రుల
తో విన్నపమిడుచు పుణ్య♦ధూర్వహమతినై. 209

క. ఆలక్ష్మీ మ్మపతినాయం
డాలవనసుత్తోౕస నుండి•య నిరంతరముౕ
గీలించుపుణ్యకార్య
శ్రీ లిన్ని యటంచు గణుతి • సేయగ వశమే. 210

—• లక్ష్మీపతిగారు చేసిన ధర్మకార్యములు •—

సీ. ఏకామ్రనాథుని • కేర్పరించెను నిత్య
భవ్యనై వేద్యాది • పడితరములు
వఱుస గామాక్షమ్మ • వారి కొనర్చె గ
ప్రిపుటారతియు బెక్క•పడితరములు
గచ్ఛపేశ్వరునకు • గల్పించె నిరతోత్స
వములకై ధనరూప•వార్షికములు
వరదరాజస్వామి•వారికి ననయంబు
నొనరించె బ్రతివత్స•రోత్సవములు

గీ. బ్రతిధను స్థితుల బులిహో•ర మొదలయిన
భూరిపక్వాన్నములచేత • బురిని వైష్ణ
నతతి దనియించె నమ్మగు•వము దమనము
లోనయిన సేవలు ఘటించె • నాన్పనేత. 211

క. ప్రతిసంవత్సరమును స
మ్మతి గార్తికమాఘపూర్ణి•మల నానాపం
డితసభ లొనరించి బహూ
కృతులం గావించు దత్సు•ధీందుప్రిల కెల్లన్. 212

క. రామానందమఠయతి
స్వాములకు న్నశ్వదుపని॰షద్బ్రహ్మమఠ
స్థామేయయతీంద్రుల కా
గామ్రించున నతఁ డొసఁగె ॰ గడువార్షికముల్. 213

సీ. ఆలించినాఁ డనే॰కావర్తు లష్టాద
శపురాణశాస్త్రప్ర॰సంగసమితి
బాలించినాఁడు తఁ॰త్పట్టణబ్రాహ్మణ
రింఛోళ్ళి మాహెవా॰రీ లోసంగి
కీలించినాఁడు సం॰త్కృతిపూర్వముగ శంక
రాచార్యయతికి వ॰ర్షాశనంబు
గ్రాలించినాఁడు సం॰ఘటితాన్నసత్త్రంబు
లఖిలదిశాగతా॰భ్యాగతులకు

గీ. గలఁడె యిటువంటిదాత భూ॰తలమునందు
విభుత కలిగినచో నల॰వేంకటాద్రి
విభునివలె నొప్పు నితఁ డని ॰ విబుధు లెంచి
రమలగుణఖాని లక్ష్మీప॰తిమహిజాని. 214

మ. సరసీజారి చకోరరాజి నలకా॰సారంబు హంసాళి హే
ళి రథాంగావళి నామ్రశాఖి పికపం॰క్తి న్మేఘు మచ్చాతకో
త్కరముంబోలె సమస్తబంధుతతి సం॰స్థానాశ్రితవ్రాతము
న్నెరి లక్ష్మీపతినాయఁ డాదరణచే॰ నిత్యంబు బ్రోచెంగదా.

మ. అసకృత్తోఁకవిదపారితోషికములా ॰ యవ్విప్రతుష్టిప్రదా
యిసమారాధనలా సదావరదరా ॰ జై.కా॥మనాథాద్యమ

ర్త్యసముద్ధర్షములాముహుర్యతిపరా◆ర్ప్రాస్ఫూర్తులా బంధుమి
త్రసమగ్రాద్యృతులాయహో యతనిచ◆ర్యల్సక్యమే మెన్నగ౯.

మ. స్థిరదూరంబగు లక్ష్య మేతు నిది యే◆చిత్రక్రమం బంచునం
బరదూరస్థితలక్ష్యయంత్రము నధో◆వార్యక్ష్యతద్బింబ ని
ర్భరదృష్టిందునుమాడజూచిఝషయం◆త్రచ్ఛేదిపార్థుం డెక్రి
మ్మరలక్ష్మీపతినాయడై పొడమెబో◆ త్మ నందురుర్వీజనుల్.

మ. రయవద్ఘోటకరాజమెక్కి హయాయలా◆రంబంచధారాచమ
త్క్రియచేత న్నడపింపుచుం బురబహి◆ర్వీధిన్వయాళి న్యశో
వ్యయలక్ష్మీపతినాయ డూన్ప గని రే◆వంతుం డొకో వైరసే
నియొకో యానకులుండొకో యనుచువ◆ర్ణించున్జనంబవ్విభు౯.

క. దరరహితుం డగదాద్యం
డరిదూరుం డహరణావ◆నాత్ముండు నిరం
తరపుణ్యజనహితుండై
స్థిర లక్ష్మీపతి సెలంగె◆ చిత్రస్థితిచే౯. 219

గీ. లలితుడగు నాన్నృపాలుని◆ల్లాలు భవ్య
లక్షణాలంబ వేంకట◆లక్ష్మమాంబ
శోభిలెం జిరుమామిళ్ల◆ సూరయేడ్వి
లసితగర్భాబ్ధినిర్గత◆ లక్ష్మి యనగ. 220

ఉ. స్వోపగతాలయం బది ప◆యోజము సంపద సౌరభంబు త
త్ప్రాపితబాంధవాదులు మ◆రాళవరాళులు నాత్మభర్తల

క్ష్మీపతినాయడుప్రభుడు ♦ శ్రీపతిగా విలసిల్లు బాండుర
ద్వీపనివాసిరాణి యన ♦ వేంకటలక్ష్మమగారు వర్ధిలున్.

మ. వరసౌందర్యకరంభరంభవిలస♦ద్వాక్కాంతవాక్కాంతచం
డరిపూద్యజ్జయశక్తి శక్తి శుభనా♦నావాసనావాసభా
స్వరహేలావిభవాలనాలబుధరా♦ట్సంతానసంతాన ని
ర్భరకారుణ్యవిశాలశాల గణుతిం♦పంబోలు నే యాయనున్.

—*కృతిపతియగు వేంకటలక్ష్మినృసింహనాయడుగారి గుణవర్ణనము*—

గీ. అప్పయోజపాణి ♦ కనఘులక్ష్మీపతి
నాయనకు ననుంగు♦నందను డయి
వెలసె వాసిరెడ్డి♦ వేంకటలక్ష్మినృ
సింహనాయడు మన♦సిరుహామూర్తి. 223

సీ. సాంద్రపద్రోపసం♦జాతుం డగుట జేసి
పుణ్యోదయకరిమం♦బు వెలయింప
జన్మప్రదేశనా♦శకు డయి పుట్టుట
జన్మభూములకు స్వా♦స్థ్యంబు నెరప
పౌరుషంబు కొలంత♦వడి పరివర్తిల్లుట
పరిపూర్ణపౌరుష♦స్ఫురణ నెగడ
శస్త్రచాతురి నరి♦జయ మొందజాలమి
శాస్త్రచాతురి నరి♦జయము నొంద

గీ. గోరి తొల్లింటి తనకై న♦కొలతి లెల్ల
బాపుకొనబూని లోకసం♦భావ్యలీల

నవతరించునృసింహు డౌ • ననగ మించె
వాసిరెడ్డి నృసింహభూ•పాలకుండు. 224

సీ. అలపుణ్యజనవర్ధ•నాస్థ నాడును నేడు
ఋణదాదిజన్మప్ర•శస్తు డయ్యె
నైజాభ్యుదయముచే • నాడు నే డాశ్రిత
ప్రహ్లాదసౌఖ్యసం•పాది యయ్యె
బారి నఖక్రియా•స్ఫూర్తి నాడును నేడు
తతహిరణ్యకశిపు•దాని యయ్యె
నామిపాళిస్మయ•హరత నాడును నేడు
విబుధలోకస్థితి • వెలయజేసె

గీ. సమధికోదారతోజ్జ్వల• స్తంభజాతు
డగుచు నాడును నే డుర్వి•యందు నార
సింహు డన వాసిరెడ్డి నృ•సింహు డనగ
రాజిలె నయారె యాది•నారాయణుండు. 225

ఉ. గోపతి భోగభాగ్యమున • గోపతి ధర్మనిరూపణంబున
న్మాపతి భక్తపాలన ను•మాపతి శీఘ్రదయానిరూఢి భా
షాపతి వాక్యచాతురి ను• షాపతి చక్కదనంబునందు ల
క్ష్మీపతినాయడుప్రభునృ•సింహనృపాలు డధీశమాత్రుడే.

ఉ. తాదనరాజకీయకలి • తవ్యవహారముగూర్చి హైదరా
బాదున కేగి యందలిసు•బాసరదారుల గాంచగా నిజా
సాదయశః ప్రథన విని ని•జాముగవర్నరు మెంటువా రహో

గాదిలిపేర్మి మగ్రోంబసిడి॥ కల్కితురాయి బహూకృతిం సమ
ర్యాదగ నిచ్చి రెప్వనికి॥ నట్టినృసింహు డధీశమాత్రిడే.

మ. అలయింగ్లీషున దా బఠించినది రో॥యర్ సి క్స్తునఫారంబె బి
ట్టలరేర్ హూణవచఃపరిసంగమున బి॥ వ్యేబియ్యలోనాగ బె
ల్లలరెం దచ్చతురత్వ మొక్కడన నే॥లా యాంధ్రగీర్వాణవి
ద్యలదారుప్కకళల్ నృసింహవిభుడు॥ద్యత్ప్రండితుండౌ జుడీ.

మ. తను జడ్జీ నృపమాత్రిగా గని సభల్॥దాజంబు నీకున్న బె
ల్చన సర్జీ పయివారి కంపి నిఖిల॥ త్సామ్రాపాళిలో మేటి యీ
యనకుం దాజము కోర్టులం దిడ నవ॥శ్యంబంచునుత్తర్వు స
య్యన దెప్పించె నెవం డతండు నరసిం॥హాధీశ్వరుం డల్పుడే.

మ. తజివీజారయ నెంత వారికి ఖుసీ॥దర్బారునం దప్పలా
నిజహారిచ్చెదు వఖ్తునర్ మహకమా॥ నీరానికుర్చీర్ స్వపూ
ర్వజనేంద్రిప్రిథ గోర్టులం దిడగవ॥ర్న్మెంటువా రార్డరుర్
గుజరాయించిరి నారసింహునకు ద॥ద్గోత్రకరిమం బల్పమే.

మ. పెరిమెం గౌనరుగా రొకప్పుడు సభల్॥బృందావనిం జేయ త
ద్వరసందర్శన మూన నెల్లరుజమీం॥దారు ల్వెసం జేర నం
దరిలో నాదొరపేకుహాండొసగిమే॥థా తేరిసుదానాది మేల్
కురిచీ న్నిల్పి బహూకరించె నత డ॥ల్పుండే నృసింహుం డిలన్.

ఉ. రాజ్యము లేకయుండినను॥ పాల్జ్ఞత పట్టి మిథోవివాదకుల్
వ్యాజ్యముల్ దృజంచి తన॥యాజ్ఞకు లోబడి చెప్పినట్లు ని
ర్వ్యాజ్యమనస్కులై వినుచు॥ వాదులునుప్రతివాదులుర్ సదా

పూజ్యుడు మాకితండనుచు ♦ మొ్రొక్కెదురీ నరసింహ
మూర్తికిన్.

సీ. కరుణారసం బొల్క♦గా జూచునేగాని
చుఱుకుచూపులచేత ♦ జూడ డెవని
మాధుర్య మొల్క సం♦భాషించునేగాని
పరుషాక్షరంబులు ♦ పలుక డెవని
మోదంబు నిండార ♦ నాదరించునెకాని
కికురించుమతి నేవ♦గింప డెవని
మక్కువ బెంపార ♦ మైత్రిజేయునెకాని
గర్వదుర్వహబుద్ధి ♦ గసర డెవని
గీ. గలడె యిటువంటిప్రభువు భూ♦తలమునందు
స్వాశ్రితులు నోచునోముల♦పంటకాక
భూపమాత్రుడె యని జనం♦బులు నుతింప
వెలసె వేంకటనరసింహ♦విభువరుండు. 233

ఉ. ఏపున నప్పొసంగునత ♦ డేటిఘనుం డిడి వెంటనే స్వద
త్తాపహృతి స్ఖటించునత♦డక్కట యెక్కడిరా జొసంగ డ
ప్పొపినయంత నూర కిడు ♦ నొల్ల డొసంగినదాని వెండి ల
క్ష్మీ(మ)పతినాయడుప్రభునృ♦సింహవిభుం డెఘనుండు రాజగుర్

సీ. పలుక నేర్పరియంచు ♦ బ్రాజ్ఞు లందురుగాని
కలనైన ననృతంబు ♦ పలుకనోప
డొసగ నేర్పరియంచు ♦ రసికు లందురుగాని
యుల్ల మెంతటివాని♦కొసగ కుండు

వినగ నేర్పరి యంచు•విబుధు లందురుగాని
వీ నొగ్గి కొంచెము•ల్విన జాల
జోర్వనేర్పరి యంచు•నుర్వి నందురుగాని
యొరులదైన్యము జూచి•యోర్వలేడు
గీ. చిత్రి మీనృపాల• శేఖరుచరితంబు
దలప ననుచు సుకవి•తతులు సంస్త
వింతురి వాసిరెడ్డి • వేంకటలక్ష్మీనృ
సింహనాయు నఖిల• సేవనీయు. 235

సీ. అర్థు లెందఱు వచ్చి•యాచించినను సారె
కిడుచెకాని చిరాకు•పడుట లేదు
తన కెచ్చువలె భాగ్య•మనుకోరికయగాని
పరులసంపద కీర్ష్య•పడుటలేదు
సత్యవాక్యప్రతి•జ్ఞాపరత్వమె కాని
బొంకు లాడుటయందు • బుద్ధిలేదు
నిరతంబు నుపకార•కరణశీలమెకాని
యపకారభావ మిం • తైనలేదు
గీ. గణుతిసేయంగ వశమె యీ • ఘనుగుణంబు
లనుచు సకలజగజ్జనం • బభినుతింప
గ్రాలె శ్రీవాసిరెడ్డి వేం•కటనృసింహ
నాయడువిభుండు రవినిభో•న్నతవిభుండు. 236

సీ. జగతిప్రజలకెల్ల • పగలుసేయు సహస్ర
భాను డెక్కడి జగ• ద్బాంధవుండు

పుణ్యజనంబుల ♦ బొలియించు యాదవ
పరిభుడేమి యకూరిర ♦ పక్షపాతి
బహుగోత్రములకు వి♦పక్షతగూర్చు జం
భారి యెక్కడి సుమ♦నోనువర్తి
ధర్మహానిక్రియా♦కర్మఠు డగు సుమా
వల్లభు డెచటిస♦ర్వజ్ఞమూర్తి

గీ. లోకబాంధవు డకూరిర♦లోలుడు సుమ
నోనువర్తియు సర్వజ్ఞ ♦ డరయ నీనృ
పాలుడే యన విలసిల్లె ♦ వాసిరెడ్డి
వేంకటనృసింహవిభుమౌళి ♦ వినయశాలి. 237

సీ. అల విబుధప్రభుం ♦ డయ్యు నానావిప
క్షప్రవర్ధనము ని♦చ్చలు ఘటించు
నార్యానుకూలవి♦హారియయ్యును నిజో
జ్వలపౌరుషలవంబు ♦ వెలితిపడడు
కువలయాప్తుం డయ్యు ♦ ఘోరాహిభయబాధ
సంతతం బెరుగ డా ♦ వంతయైన
పురుషోత్తముండయ్యు ♦ భూరిపుణ్యజనస
ఖ్యంబు నశ్రాంతంబు ♦ నాచరించు

గీ. నౌర యితనిచరిత ♦ మద్భుతం బని కవి
వర్యు లభినుతింప ♦ బరిఢవిల్లె
విదిత వాసిరెడ్డి ♦ వేంకటలక్ష్మీనృ
సింహమూర్తి ధృతవి♦శేషకీర్తి. 238

క. నరసింహాప్రభుడు గవ
ర్నరుమెంటున దండ్రిగా రొఁనర్చినకృషి చే
కురమి న్దా మఱుల న్గరు
సరణిఁ గ్రింథంబు నడపెఁ సర్కారునకున్. 239

—ఁ నరసింహనాయుడుగారు రాజ్యముకొరకై అర్జిపెట్టుట ఁ—

వ. అది యెట్లనిన.

క. అరిబాకీకై మామక
ధరణి స్వారాజొఁనర్చుఁ తరి లావరి వం
దురు మత్పౌర్వికులకు ని
త్తెఱఁగున సర్కారువారు ఁ దీర్చిరి వెరపుఁ. 240

సీ. కరవుచే నూళ్లు షిఁకస్తయ్యె రయితుల
మీద నీసరికున్న ఁ మీబకాయ
హక్కెల్ల వదలు కొఁన్నట్టైన నాబాది
జేయ శేరీక్రిందఁ జేర్తు మూర్వి
జిరకాలపౌర్వికాఁర్జితరాజ్యము నశించె
గద నేటితో ననిఁమది వగవకు
డిదె బాకిపడు కప్పఁమెల్ల దీరినతోన
మీపరివ్రిఢిమంబుఁమీకు నిత్తు

గీ. మని యినాయితునామాలుఁబనిచి మఱల
వారసుల కీయదలచి సఁర్కారుక్రింద
జేర్చుచున్నారము బకాయఁ జెల్లుదనుక
నెవ్వ రీయాస్తి వెలబాడ ఁ నెసగదనుచు. 241

ఉ. పాటలుపెట్టవచ్చిన నృ♦పాలుర పాటలు పెట్టకుండ నే
ర్పా టొనరించి యింతసుల♦భక్రియ మేమనకుండ ముందిడే
మాట కరారొనర్చి వెస ♦ మాబహుకోట్లఖరీదు సేయునె
స్టేటొకమైదువేలు వెల♦జేసి దివాణ మయారె చేకొనెన్.

ఉ. చేకొని యెన్నియేండ్లు గడ♦చెం దమ రీసరి కెంతొ యైవజుం
గైకొని రస్మ దుర్విసర♦కారుబకాయ బకాయతాతయుం
జేకొని మున్నుమాకుదయ♦సేయకరారుప్రకారమీభృతిన్
వేకృప నియ్యుడంచు మొఱ♦బెట్టినచో జెవిబెట్టరే దొరల్.

మ. కరము ల్సెల్లినవయ్యు గైకొనినవై♦గైకొంటకు న్మాగుగా
నెటికా సేనియు లౌనసీనివగు నం♦దిగాన్రిమసీమాదిబం
దరుసర్కారున నున్న నారుసముతు♦ల్తారూరకే కొన్న వా
రరి బాకీపడనట్టినాళ్లయిన మా♦కర్పింపరాదా దయన్.244

క. ఈయద్భుత మిట్లుండె గ
దా యిక యెస్టేటు దఖలు♦తప్పిన సంస్థా
నీయుల కఖలన్యాయవి
ధాయులు సర్కారువారు ♦ తమదయకొలదిన్. 245

మ. గుజరాయించిన లౌనసు ల్దెలిపెద♦న్గుంటూరుసర్కారుకి్రం
ది జమీందారులుమానుగుప్రభుతికి♦న్వేయింటికినూర్మడొసం
గు జగాన్యాయమొనర్చి రత్తెఱగున♦న్గుంటూరుజిల్లాశివా
రుజమీన్బాబతుమూడువేలయిదునూ♦రుల్వొందదయన్దెబ్బదిన్

క. అలబందరుసర్కారున
గల్గినలౌనసుల్వాడు ♦ కౌజులకాండేరి

గులవారికి లౌనసు మే
ల్నెలకొన వేయింటికి బది ♦ నిర్ణయమయ్యెఁ. 247

క. వారివరుస బందరుస
ర్కారున గల యస్మదీయ♦గ్రామంబులకు .
న్నారిడునార్ధరువిధిచే
నారయగ బదేనువంద ♦ లగులౌన సొగెఁ. 248

క. తాదృశగతి గణుతింపగ
మాది దరోబస్తు రాష్ట్ర♦మండలి మీద
నా్రదగు లౌనసుమొత్తం
బైదువెయిల నూటడెబ్బ♦దైదగు వీనిఁ. 249

క. కేవలముగ నెలనెలకును
సీవలె నండులకు మాకు ♦ హెడ్డుకుటుంబ
శ్రీవిధి వేయునొసంగుదు
రావేయుంగాక మిగిలి ♦ నవి లే దిడుటల్. 250

ఉ. ఆయవరేజి జేయ నయి♦నట్టిది లౌనసుమొత్తమీయగా
దాయల కిచ్చు లౌనసులు♦దచ్చిశతంబులు నిందులోవి కా
వా యనబోల దెట్లన రి♦వాజుగ వారికి వేంకటాద్రిరా
జాయలనాడె వారికి న♦ర్షమినహా యొనరించియీబడెఁ.

క. పదునెనిమిదివందల డె
బ్బదియైదవ హూణశకపు ♦ వత్సరమందు
న్బదియవమాసం బందున
బదియేనిరునూరు లీరు♦బదినెంబరునన్. 252

క. కలకత్తా గౌనరుజన
రిలు యౌరసుడైన దత్తు♦డైన నసల్‌షా
మిలిదారునై జమ్మృతవం
శ్యులలౌనసు కర్త్వా డనుచు ♦ నుత్తరు విడియెన్. 253

గీ. అట్టిహెడ్గౌనరార్డరు♦పట్టి వాసి
రెడ్డి ప్రథమకుటుంబపు♦జేడు నిజకు
లంబున గతించువారల ♦ లౌనసులు వ
హింప నర్హ్వాండు గద యవి ♦ యెవ్వి యనిన. 254

సీ. మన్నెసుల్తానగ్ర♦మహిషికి వెట్టెమ్మ
కర్పించు నన్నూరు ♦ నైదుపదులు
నద్దేవికి సపత్ని♦యగు పార్వతమ్మకు
నిడునవి నన్నూట ♦ యేబదియును
నస్మత్పితామహీ♦యగురంగమాంబకు
నిడు నవి మున్నూరు ♦ యేబదియును
నాయమకు సపత్ని ♦ యగు నచ్చమకు నిర్ణ
యించిన మున్నూట ♦ యేబదియును
గీ. రామనాధేభ్యుజానక ♦ భ్రాత రామ
నాయడు ప్రభున కొసంగు♦నాల్గునూరు
లిరుబదియు వారు మరణంబు ♦ నెనయుతోన
మాకు నీవలెగద యవి ♦ మాని రిడుట. 255

క. ఈయనువున మాకగు న
న్యాయం బెజ జిత్తగించి ♦ న్యాయయుతాభి

ప్రాయుల్ సర్వాధిపతుల్
న్యాయము మా కూన్ప తమ ద♦యం బ్రార్థింతుర్. 256

చ. అనిపసజక్రవర్తు లభి♦యాతినృపాలురసీమ లాక్రమిం
చినయశ మాత్మతుష్టియును♦ జేకుర మాదృశసంశ్రితాళిజీ
వనమును గొన్న నేమియగు♦ వార్ని ధిగ్రోలినగాక వృష్టినిం
పిన మడుగూటిన స్లవము♦ మేఘునకున్ జఠరంబు నిండునే.

—♦ బ్రిటిషు సామ్రాజ్య వర్ణనము ♦—

మ. కృతవార్తాలతలా సధూమశకట♦ శ్రీనౌకలా యాషధా
యతినవ్రాతములా బుధాగణితవి♦ద్యాశాలలా సర్వతో
వృతశాల్యోత్కరకారణాఖిలసరి♦ద్విస్తారకుల్యాతులా
క్షితి సౌఖ్యార్థ మధీశు లూనుచుపను♦ గీర్తింపగా శక్యమే.

మ. జనసౌఖ్యంబునకై సహస్రముఃబల♦క్షలోకట్లు పర్యంతమా
ధనముంద్యాగ మొనర్చి తాదృశమహా♦త్కార్యంబులం జేయుచు
న్మనుజత్రాణ మెయాత్మవిత్తమనిసం♦ భావింపుచున్భూమిపా
లనముం దారుచు హూణభూపతులతు♦ల్యుల్యెవ్వరిద్ధారుణిన్.

సీ. వీతాహిభయులౌట ♦ వెస నరేంద్రాఖ్యని
ర్భరకువలయరక్ష ♦ రాజసంజ్ఞ
ద్రవిణవర్గోవిహా♦రణ సార్వభౌమాఖ్య
పృథులశార్వరగర్వ♦హృతి సినాఖ్య
ప్రతికూలఘర్షణో♦న్నతి వాహినీశాఖ్య
తతధైర్యమున ధరా♦ధరసమాఖ్య

బహుళరాజసేవార ♦ భటి రాజరాజాఖ్య
జితవృత్రిబలులౌట ♦ జిష్ణ్వభిఖ్య

గీ. సార్థవైఖరి దమయం దే ♦ సంగ నున్న
తోన్నతప్రాభవము సల్పు ♦ చున్నవారు
వీరి సరిబోలువారల ♦ వినము కనము
భళిర యింగ్లీషువారెపో ♦ ప్రభువు లరయ. 260

సీ. తమపరిపాలనో ♦ త్సవలాభమున సదా
వసుమతి వసుమతీ ♦ త్వంబు గాంచె
దమతో నెదిర్చిన ♦ దర్పవత్సామంత
దస్యుల్ పలాయిత ♦ దస్యులైరి
తమకళాభ్యాసన ♦ ద్మముల విద్యార్థికు
మారు లజాహీట్కు ♦ మారులైరి
తమకృపావిభవంబు ♦ దాల్చునానాదీన
వితతి నానాదీన ♦ వితతి యయ్యె

గీ. నెంత ప్రాభవనైపుణ్య ♦ మెంతశౌర్య
పాటవం బెంత విద్యాభి ♦ వర్ధనాస్థ
యెంత సంశ్రితరక్షణ ♦ స్పృహ సమస్త
విధుల నింగ్లీషువారెపో ♦ యధికనృపులు. 261

సీ. కరుల నెక్కి వయాళి ♦ గావింప మన కబ్బె
హాదనంచు దికృతుల్ ♦ ముద మెనసిరి
జడిగా కెపుడు నబ్ధి ♦ శయనించి సుఖయింప
గలిగె నెన్నన కంచు ♦ గరుడు డలరె

నందలు దనరూప • మైరంచు దండ్రితా
తల వెదుకగ సాగె • సలువపట్టి
ప్రజ దృశ్యమానప్ర•పంచ యయ్యె నిజేశు
భారమారె నని య•నూరు డెంచె

గీ. వివిధభూభారవహనంబు • వివిధలోక
రక్షణక్రమ మక్షయ•ప్రబలకీర్తి
ధుర్యమహితభయంకర• శౌర్యధూర్వ
హ మగు నింగ్లీషుసామ్రాజ్య • మతిశయిల్ల. 262

సీ. అఖిలాభియాతిసం•హారంబె హారంబు
ధాత్రీప్రజాభివ•ర్ధనమె ధనము
భూరికార్యస్పృహా•భోగంబె భోగంబు
సర్వజనైకర•క్షణమె క్షణము
పరమధార్మికమనః•పర్వంబె పర్వంబు
పృథ్వీన్మకుశలప్ర•వృత్తి వృత్తి
వివిధకృతన్యాయ•వృద్ధిలీలయ లీల
భూజనద్దైన్యవి•ముక్తి ముక్తి

గీ. తమకొదవినట్లు దలచుచు • సమధికమతి
నహరహఃపరివర్ధిత•న్యాయపాల
నమున నానాధరిత్రీజ•నమున కమిత
తోష మిడుచున్నవారు బ్రిటీషువారు. 263

ఉ. న్యాయమె మాకు దైవతము•న్యాయమెమాకభివర్ధనంబిడు
న్యాయమెదీర్ఘమేమనుచు•న్యాయపదాంకితరాజ్యులై నయాం

గ్లేయులు మారికార్ధ పరి॥కించి కృపామతి మాకునైనయ
న్యాయముమాన్పిమాదౌరత॥నంబునుమాకునొసంగవేడెదన్.

క. అని సర్వాధిపులను బ్రా
ర్ధన సేయుచు హయాణదత్త॥కౌప్యసహస్రం
బున నిష్టాపూర్తంబులు
తనగుపుచు నృసింహనృపతి॥తద్దయు వెలసెన్. 265

—॥ ముగింపు ॥—

మ. అనలార్కేందువిలోకలోకభయకృ॥ద్ధాలాహలాహారహా
రనికాయీకృతనాగనాగదనుజేం॥ద్రధ్వంసనోద్యోగమో
గనిరూఢాత్మవికాసకాసరహయ॥కౌర్యచ్ఛిదాపాద సా
దనమత్సర్వసుపర్వ పర్వతపరో॥ద్యద్ధర్మధర్మప్రియా. 266

క. కమలాక్షరవిశిఖాక్షర
కమలాహృదయేశబాణ॥కమలాప్తకరా
కమలాంకార్ధవతంసక
కమలాపదచికురవిజిత॥కమలశ్శరహరా. 267

తరల:—ప్రియత కేశవ జగదీశ ॥ భృతమునీశ శాబ భూ
ర్యయనివేశ పదకుశేశ॥య గదిగీశ దుర్జన
వ్యయకరాశ సదవనాశ ॥ యపటితాశదక్షుదు
ర్దయవినాశ భృగుపరాశ॥రసమరాశనార్చితా. 268

క. సితకరనిధికరిశశి (1891) వ
ర్ధితహాయనాబ్దమున వాసిఁ రెడ్డీయాఖ్యాం
చిత మేతద్వ్యవహారచ
రితము నృసింహవిభునాజ్ఞఁ గృతిసేయ దగెన్. 269

మ. ఇదికృష్ణాతటిసీతటీబహుసుధీవ్యాద్యామరావత్యబీ
శదిశాయోజనదూరసంస్థితసమంచద్బాలెమర్త్యగ్రహా
రదృఢస్థామరవాదిరామయకవీంద్రప్రోద్ధితగ్రంథపూ
ర్తిదమాశ్వాసవరంబు రెండవది వర్ధిల్లు స్సదాస్థాయియై.

ఇది రెండవయాశ్వాసము

సర్వము సంపూర్ణము.



